GRIHALAKSHMI

# గృహలక్ష్మి.

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు:
డాక్టరు కే. యస్. కేసరి

సంపుటము ౧౮] ఫిబ్రవరి 1949 [సంచిక ౨




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపీ ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# విషయసూచిక


ప్రధానవ్యాసం: శీలము... 65
ఇంగ్లాండులో స్త్రీలఓట్ల పోరాటం ... 67
ఆశీస్సులు (ప): తనికెళ్ల సన్యాసమ్మగారు .. 69
చెనికోనుకుంటాను: (క) బులుసు జి ప్రకాష్. 70
భారత క్షత్రియవీరరమణి: శ్రీ కోనే సర్వేశ్వర రావుగారు .. 71
గృహలక్ష్మికి శుభాశీస్సులు (ప): అరవెల్లి కన్న రాజగోపాలరావు వజ్ఝలశ్రీమన్నారాయణగార్లు 73
"ధన్యజీవులు". కస్తూరిబాగాంధీ: సత్తిరాజు సూర్యకాంతమ్మగారు . 74
పువ్వు - (ప): 'సోపూరి' ... 77
బాలప్రహ్లాద: శ్రీ కనుపర్తి వరలక్ష్మమ్మగారు 78
వేదాంతం (గీ): శ్రీనివాసమ్మగారు ... 80
నాచిన్ననాటి ముచ్చట్లు: కే. యస్. కేసరిగారు 81
గృహవైద్యము ... 89
పాకకళ ... 91
ఇంటిపనులలో మెళుకువలు ... 93
బ్రతుకుతెరువు ... 95
సహగమనము (క): యం. రామమోగారావు... 99
హర్‌బిలాస్ శర్దా:
శ్రీ వంగోలు వెంకట రంగయ్య పంతులుగారు 102
బాడీషియా (ప): కిరణ్. ... 105
శారద లేఖలు ... 107
గృహలక్ష్మికి పద్యరత్నాలు:
కల్లూరి అహోబలరావు ... 109
నిజమును పలికించు కంఠహారము
సర్వేపల్లి సులోచనాదేవిగారు ... 110
స్త్రీ మాతృమూర్తి: కనకంగారు ... 111
అభిసారిక: ఏ. పి. కుమారిగారు ... 113
పళని దేవాలయం: కె. కె. మీనన్‌గారు ... 115
మూరాలి (క): "శేషు" ... 120
చదరంగము (ప): .. 121
సామెతలు .. 122
లోకవార్తలు .. 125
పుష్పచయము ... 126
సంపాదకీయములు .. 127
స్వీకారము ... 128
పంచాంగము ... 130



గృహలక్ష్మికి బుద్ధుని బోధ

చూ॥ 88 పుట




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

## శీలము

రాష్ట్రపతి డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు గతమాస మధ్యంలో చెన్నరాష్ట్రానికి విజయంచేసినారు. పలుతావుల సంచారప్రచారాలుకూడా గావించారు. ప్రజలున్నూ, వివిధ ప్రజాహితసంస్థలవారున్నూ వారి ననేకవిధాల గౌరవించారు. వారున్నూ తమకుగావించిన గౌరవాలకు కృతజ్ఞత తెల్పుతూ తమపదవికి అర్హమైన హితోపదేశాలను, కటువైనా, నిర్మొగమాటంగా చేశారు.

వారి హితోపదేశాలన్నింటికీ పల్లవి వక్కటే. అది ఆంధ్రమహాసభ గావించినది కానివ్వండి, మంత్రులు, ప్రజాప్రతినిధులు ఇచ్చినవిందు కానివ్వండి, మహిళాసంఘము, మహమ్మదీయమిత్రులు, న్యాయవాదులసంఘం ఎవ్వరైనాచేసినది కానివ్వండి, అన్నిటికీ వక్కటే పల్లవి. అదే 'శీలసంరక్షణము.' అదే 'సత్ప్రవర్తనము.'

27 సం॥లు గాంధీమహాత్ముని నాయకత్వాన అసిధారావ్రతంగా స్వాతంత్ర్య పోరాటం నడిపినారు, కాంగ్రెసువాదులైన స్త్రీలు పురుషులు. వారి ననేకవిధాల ఆదరించి మన్నించి అండయై నిల్చారు ప్రజలు. ఎప్పుడు స్వాతంత్ర్యము సిద్ధిస్తుందా, ఎప్పుడు, పరిశ్రమలు, వర్తకవాణిజ్యములు వృద్ధిపొందింతామా—అని ఉవ్విళ్లూరారు వర్తకులు ధనాఢ్యులు. పరపాలనాపీడ తొలిగినట్లైతే—పుష్కలంగా పండించి, పండిందంతా

ప్రజల కందించి కరువుకాటకంలేకుండా చేతామని కలలగాంచారు వ్యవసాయదారులు, భూస్వాములు. ఆ స్వాతంత్ర్యము రానేవచ్చింది! కాని ఆ స్వాతంత్ర్యమును ఉదాత్తమైన భావౌన్నత్యంతో అనుభవించడానికి, రక్షించుకోడానికి తగిన శీలసంపత్తిమాత్రం అంతటా మృగ్యమైపోయింది. లంచగొండితనము, చీకటిబజారువర్తకం బహిరంగ రహస్యాలైపోయినవి. వారువీరనిలేకుండా ఎల్లరి స్థితి అట్లాగే అయిపోయింది. కంచే చేనుమేసినట్లు, ఇన్నాళ్లూ, గాంధీమహాత్ముని నాయకత్వంక్రింద ప్రజల కాదర్శప్రాయంగా జీవితాలు నడిపిన కాంగ్రెసువాదులున్నూ, ఈ శీలభంగములో ఇతరులకు తీసిపోవడం లేదు; ఇందులోనూ ముందడుగువేసి నడుస్తున్నారా అన్నట్లు కనిపిస్తున్నది. కాబట్టి డా. పట్టాభిగారివంటి యథార్థవాది, రాష్ట్రపతిగా, 'దేశీయులు శీలము సంరక్షించుకోవలెను; పెంపొందించుకోవలెను.'—అని ఖండితవాక్యముల ప్రజలను, ప్రజానాయకులను, ప్రజాహితకరసంస్థలను హెచ్చరించడం అర్హమైనది; హర్షదాయకమైనది.

అయితే ఇది ఒక్కనాటిపని కాజాలదు; ఒక్కవ్యక్తిగాని, కొందరు వ్యక్తులుగాని చేయదగ్గదికాదు. స్వాతంత్ర్యమువల్ల సిద్ధించిన నూతనావకాశాలమధ్య ఆశాపాశముల చిక్కుపడక, భ్రమప్రమాదముల తొట్రుపడక, కాలు నిలువత్రొక్కుకొని కష్టించి కృషిచేయవలయును.

కాని—బిడ్డల తల్లులైన గృహలక్ష్ములు పూనుకుంటే—రాగల తరమువారైనా శీలసంపన్నులు కావడానికి అవకాశమున్నది. ఏమంటే, ఉగ్గుపాలదగ్గరనుంచి బిడ్డకు అన్నిటికన్నా 'శీలము' ఉత్తమోత్తమము—అనే అభిప్రాయమును, దానిని ఏమైనా కాపాడుకోవలెననే దీక్షను, శక్తిని బిడ్డల కలవరిచే అవకాశము తల్లిది. తల్లియే జాతికి ప్రప్రథమమైన గురువు. అందుకు ధర్మోపదేశముకాదు మార్గము; స్వయంగా ధర్మాచరణము. తల్లి బిడ్డలు తన్నుచూచి అనుకరించదగిన ఉత్తమశీల లక్షణములు అలవరచుకొని, దయా సత్య ధర్మ శౌచాదికములను ఆచరించినట్లైతే-అచిరకాలంలో మనజాతిశీల సంపన్నము కాగలదు. అప్పుడే మనకు సంప్రాప్తించిన స్వాతంత్ర్యము శ్రీరామరక్ష.

ఇట్లు ఉత్తమోపదేశమును, గావించుచున్న రాష్ట్రపతి పట్టాభిగారికి మా అభివందనములు.



# ఇంగ్లాండులో స్త్రీలఓట్ల పోరాటం

ఇటీవల 1939 మొ॥ 46 వరకు జరిగిన ఘోరమైన ప్రపంచయుద్ధం ప్రపంచంలో "డెమాక్రసీ" విధానాన్ని సంరక్షించడానికని అన్నారు. "డెమాక్రసీ"కి మూలం—"ప్రజాభిప్రాయం." ఆ "ప్రజాభిప్రాయం" కనుక్కోడానికి మార్గం—"ఓట్లు" తీసుకోడం. ఈ ఓటు చేసేహక్కు వ్యక్తివచ్చిన ప్రతివారికీ ఉంటేనే—నిజమైన ప్రజాభిప్రాయం తెలిసేది. 'ప్రతివారికీ'—అంటే స్త్రీకి, పురుషుడికి, ధనికి, నిర్ధనికి, పేదకు సాధుకు, పండితునికి పామరునికి—ఏ భేదంలేకుండా ఒక నిర్ణీతమైన వయస్సువచ్చిన వారందరికీ ఉంటేనే—అన్నమాట.

"ఈ ప్రజాభిప్రాయం ప్రకారం రాజ్యంనడిపే విధానానికి ఆదికర్తలం మేమే" నంటారు ఆంగ్లేయులు. అయితే ఆ ఆంగ్లేయులకు—జనాభాలో సగమైన ఆడవాండ్లకుకూడా ఓటు చేసేహక్కు ఉండాలని - వాళ్లకు తోచలేదు సరేకదా - అర్ధశతాబ్దం - ఆడవాళ్లు చెప్పినా తెలియలేదు. వాళ్లైనా ఊరికేచెప్పారా. ఖంతో అఘాయిత్యంకూడా చేశారు; ఎన్నోబాధలుకూడా పొందారు — ఆ గాథంతా వ్రాస్తాను.

స్త్రీలు రాజకీయహక్కులకై ఆందోళనచేయడం 1819 లోనే ప్రారంభమైనది. మాంచస్టర్‌లో అప్పుడు ప్రజలు ఎన్నికలపద్ధతి మార్పుచెందాలని కోరుతూ మీటింగుచేస్తే ఆ మీటింగును సోల్జర్లు వచ్చి చెదరగొట్టారు. ఆ ప్లాటుఫారంమీద పురుషులతోపాటు ఒక స్త్రీకూడా ఉన్నదట. అయితే పిదప ఆంగ్ల స్త్రీ చిరకాలం నిద్రపోయింది. తిరిగీ 1865 లో మేల్కొన్నది.

40 సం॥ తర్వాత కొందరు మిత్రులతోగూడి టీ త్రాగుతూ - యమెలిపాంక్ హర్‌స్ట్‌అనే ఆమె "ఎన్నాళ్లనుంచీ మనం ఓటు హక్కుకొరకు ప్రయత్నిస్తున్నాము" అని మిత్రుల నడిగినదట. వారు 40 సం॥లు అన్నారు. "ఆఁ ఇంకా విజయంగాంచలేదు ; అయితే కొత్తమార్గాలు త్రొక్కుదాము" అన్నదామె రోషావేశంతో. అది మొదలు మొదటి ప్రపంచయుద్ధము ప్రారంభమయ్యేవరకూ, రోజూ పత్రికల్లో. ఆడవాళ్లు ఓట్లకొరకు చేసే అఘాయిత్యముల వార్తలే.

వాళ్లు సభలుచేసేవారు. ఇతర పార్టీలసభలు చెదరగొట్టేవారు. జైళ్ళకెళ్లేవారు. నిరశనవ్రతాలు చేసేవారు. బలవంతంగా ఆహారమివ్వబడేవారు.

ఈ "బలవంతపు విందు"—ఇదొక ఘోరము. ఆరుగురు ఆడవార్డర్లు ఒక స్త్రీఖైదీనిపట్టుకొని నోరుతెరచి ఉండేట్లు నోట్లో ఏదైనా గట్టివస్తువును పండ్లసందున తురిమి, ఆహారం నోట్లో పోసేవారు ఇదీ వీలుకానప్పుడు ముక్కులోగొట్టం ఎక్కించి ఆహారద్రవం లోపలికి 'పంపు' చేసేవారు. పెద్ద ఇంటి బిడ్డ యొకతె కోర్టుఎదుటకు విచారణకు తేబడ్డపుడు మోకరించి, రాజుగారి కీవిధంగా మొరపెట్టుకున్నది "దేవరా, ఈ బలవంతపు విందారగింపులు మాన్పించండి" అని. తర్వాత అందుకుల బిల్లు ఒకటి పార్లమెంటులో ప్రవేశపెట్టబడినది. దానిని "పిల్లి ఎలుకబిల్లు" అని ఆడవాళ్లు అపహాస్యంచేశారు.

ఆందోళనపరులగు స్త్రీఖైదీలున్నూ ఊరుకోలేదు. వాళ్లనుంచిన హాల్లోనే జైలులో ఒక్కకిటికీ రెక్కను తిన్నగా ఉంచలే. పిడికిళ్లగుద్ది పగులగొట్టేశారు.

పాప మీ స్త్రీలు జైలులో నానాబాధలుపడి శవాలై బయటపడేవారు. అయితే నేమి, మళ్లీ నాలుగురోజుల్లో ఏదోపేరట జైలులోపడవలసిందే. ఆ జైలులోవాళ్లకు ముతకరొట్టె ఇచ్చేవారు. వాళ్లలో

చాలమంది పెద్ద ఇంటిబిడ్డలూ ఉండేవారు. పెద్దఇంటివారిని కొంచం మెరుగుగా చూచేవారు. ఒక సంపన్నురాలు, ఈ తారతమ్యానికి సహించక, కూలిదానిమాదిరి గుడ్డలువేసుకొని వెళ్లింది. రెండోసారి ఆమె అట్లాగే వెళ్లేసరికి ఆమెపడ్డ బాధలకు తిరిగీ కోలుకోలేదు.

1913 లో ఒకామె చాలా గొప్ప సాహసంచేసింది. డెర్బీ గుర్రపుపందేలలో—రాజుగారి గుర్రం గాలిలా పరుగెత్తుకొస్తుంటే - గమ్మున గెంతి - ఆ గుర్రం కాళ్లదగ్గరపడ్డది గుర్రం గిర్రున తిరిగిపడ్డది. రౌతు పొర్లిగింతలుపెట్టాడు. ముగ్గురూ చచ్చి కుప్పకూలిపోయినారు.

పోలీసువాళ్ళున్నూ వీరిని ఆడవాళ్లేఅని ఎక్కువ నాజూకుగా చూచేవారుగారు. అయితే, "ఆడవాళ్లకు ఓట్లేమిటీ" అనే వ్యతిరేకపు పార్టీవాళ్లుమాత్రం కట్టెలు తీసుకొని వీళ్లమీదపడి బాదేవారు. గనులు సమీపంగాఉండే ఒకపట్నంలో వీళ్లను పెద్దదబ్బాలలో (Barrels) ఉంచి కొండమీదినుంచి క్రిందికి దొర్లించారట!

స్త్రీలున్నూ ఆత్మరక్షణకు కొన్ని ఉపాయాలవలంబించేవారుట. చిన్నబుడుపుకర్రలు, కొరడాలు చొక్కాచేతులలో దాచుకొని వారు తిరిగేవారట.

వీళ్లు చేసిన మరో అల్లరి చాలా చిత్రమైనది. పార్లమెంటు సభజరిగేటప్పుడు అక్కడికి వెళ్లేవారు. వీరిని రానివ్వకుండా వారు కాపలాకాచేవారు. వీరు (స్త్రీలు) ఆ భవనం కటకటాల దగ్గరకుపోయి, ఆ కటకటాలకు తమ్మునొక గొలుసుతోబంధించుకొని గట్టితాళంకప్ప తగిలించేశేవారు. ఆపైన బిగ్గరగా గొంతెత్తి ఉపన్యాసం ఇస్తుంటే - పోలీసులు వచ్చేవారు, ఎట్లాతెరుముతారు? ఆ పోలీసువాడు అటు ఇటు తిరిగి తాళాలు పగలగొట్టేపనివాణ్ణి పిలుచుకొనివచ్చేదాకా - ఆ ఉపన్యాసం సాగుతూనే ఉండేది. ఇదంతా అయ్యేసరికి అరగంట అయ్యేదట!

ద్వారాలు బిగించుకొని వ్యతిరేకులు సభలుచేస్కుంటూఉంటే, వీళ్లు కిటికీల దగ్గరకు, కటకటాల దగ్గరకు పోయి, "ఆడవాళ్లకు ఓట్లు" అనే చీట్లువ్రాసి అంటించిన రబ్బరుబంతులను వాళ్లపైకి విసిరేవారుట.

రాను రాను - ఆందోళన తీవ్రరూపం దాల్చింది. ఆందోళకులు చర్చీలుసహా, బిల్డింగులు తగల పెట్టడం ప్రారంభించారు.

ఇంతలో 1914 ప్రపంచయుద్ధంవచ్చింది. దేశానికి ఉపద్రవం వచ్చినదని - ఆందోళన కట్టిపెట్టి - ఆడవాళ్లు ప్రభుత్వానికి సహాయంచేశారు ఆడవాళ్లసేవ ప్రభుత్వంగుర్తించింది. 1918 లో 30 సం॥లు దాటిన పడుచులకందరికి "ఓటు" హక్కునిచ్చారు. 1928 లో అదే - 21 సం॥ల వాళ్లకు లభ్యమైంది. ఆడవాళ్ల అఘాయిత్యం - విజయమందింది!

మన భారతదేశంలోనే, చీమ చిటుక్కుమనకుండా-ఆడవాళ్లకు ఓట్లూకలిగాయి; సీట్లూ దొరికాయి; మంత్రులూ అయినారు.

1919 మాంటుఫర్డు సంస్కరణములలో ఆడవాళ్లకు ఓట్లు ఇవ్వలేదుకాని, "రాష్ట్రము లిచ్చుతో వచ్చు" అన్నారు. 1921 లోనే మద్రాసు బొంబాయి రాష్ట్రాలు - ఇచ్చాయి. 1926 లో శాసనసభలకూ నిలువవచ్చు అన్నారు. అప్పుడే శ్రీమతి కమలాదేవి చట్టోపాధ్యాయిని ప్రప్రథమంగా శాసనసభకు నిలిచి



ఈ సారి

# "గృహలక్ష్మీ స్వర్ణకంకణము"

విద్యాసుందరి, గానకళావిశారద

## శ్రీమతి బెంగుళూరు నాగరత్నంగారికి

ఇవ్వబడును.

## 6-3-1949

ఆదివారం సాయంకాలం 4 గంటలకు మదరాసు రాయపేటలో కేసరీకుటీరము నెం 15, వెస్ట్‌కాట్ రోడ్డున, ఈ ఉత్సవము జరుపబడును.

ఎల్లరు విచ్చేయ ప్రార్థితులు.

ఇటీవల శ్రీ శ్రీ శ్రీ గవర్నర్ దంపతులు తూర్పుగోదావరీ పర్యటన నొనర్చి
నపుడు వారచ్చటనేక ప్రజాహితకర కార్యముల పాల్గొనియుండిరి.
రాజమహేంద్రవరమున గౌతమీ గ్రంథాలయమునందు స్వర్గీయ
బాబాయమ్మహాలులో స్త్రీల రిక్రియేషన్ క్లబ్బుగలదు.
అందు స్త్రీ జనాభ్యుదయ శాఖ యొకటి
శ్రీ శ్రీ శ్రీ మహారాణీవారిచే తెరువబడినది.





స్త్రీజనాభ్యుదయశాఖా ప్రారంభోత్సవ సమయము
దేశసేవికలు శ్రీ మహారాణికి
జాతీయ పతాకములతో
గతమిచ్చిరి.





పురప్రముఖురాండ్రగు శ్రీ బత్తుల కామాక్షమ్మ
మొదలైనవారితో శ్రీ గవర్నరుగారు నిలిచి
యుండగా తీయబడిన ఛాయాచిత్రము.

పురుషునితో పోటీచేసి ఓడిపోయింది. తర్వాత శ్రీమతి డా. ముత్తులక్ష్మిరెడ్డిగారిని మద్రాసు శాసనసభకు ప్రభుత్వమువారు నామినేటుచేశారు. ఆమె శాసనసభ కుపాధ్యక్షురాలుకూడా అయినది. 1935 లో మద్రాసు శాసన సభాసభ్యత్వం కాళీపడి బైఎలక్షన్ రాగా - శ్రీమతి ఆచంట రుక్మిణిలక్ష్మీపతిగారు పోటీచేసి గెల్చారు.

1935 సంస్కరణ చట్టం ఆడవాళ్లకు ఓట్లేకాక, శాసనసభలకు నిలిచేహక్కేగాక, దేశంమొత్తంమీద 42 సీట్లు వాళ్లకని ప్రత్యేకించారు, అదీకాక మగవాళ్లతో పోటీచేయవచ్చు అన్నారు.

1937 లో శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు శాసనసభ కుపాధ్యక్షురాలైనది. విజయలక్ష్మి పండిట్, మంత్రే అయినది. 1946 లో ఇద్దరూ మంత్రులైనారు.

## ఆశీస్సులు

శ్రీ! యని పిల్వఁగానె, సిరిచేరఁగవచ్చిన సంతసంబునన్
హాయిని గొల్చుచుండెడి యొయారిని, అక్కునఁజేర్చి నవ్వుతో
రా! యనివేడ్కతోడ, నధరంబునఁ జుంబనమిచ్చుచుండు, నా
రాయణుఁడైనవాఁడు గృహలక్ష్మి! సదా నినుఁ గాచుఁగావుతన్.

కైలాసాద్రి విహారుఁడున్, దివిజరక్షాదీక్ష సన్నద్ధుఁడున్
హాలాహాలవిషాగ్ని కంఠధరుఁడున్, అంభోధిగంభీరుఁడున్
ఫాలాక్షాగ్ని వినాశితస్మరుఁడు, సర్పాధీశభూషుండునున్
శ్రీ లక్ష్మీపతి స్నేహితుండు, గృహలక్ష్మీ! నిన్ను రక్షించుతన్.

అజ్ఞానులైనస్త్రీలను
సజ్ఞానులచేయఁబూని సమయము జేసెన్
ప్రజ్ఞావంతుఁడు కేసరి
సుజ్ఞానీ! ఆతఁడున్న శుభములుకలుగున్.

తనికెళ్ల సన్యాసమ్మ.

శ్రీ బులుసు జి. ప్రకాష్

# 'చెవి కోసుకుంటాను'

ఆ అమ్మాయి కథ చూసి అంతమంది సంతోషంతో పొగుడుతూ ఉండేవారు. కాని ఆ అమ్మాయి కథలంటే ఆ అబ్బాయికి పడేదికాదు. అంతమంది అమ్మాయిని పొగుడుతూంటే అబ్బాయికి అసూయ పుట్టేది. అబ్బాయికూడా మంచికథ రాసి అమ్మాయికి చూపెట్టేడు. అమ్మాయికికూడా పంతంవచ్చి కథరాసి అబ్బాయికి చూపెట్టింది. ఇద్దరూ పోస్టుచేసేరు కథలను. ఇంక 'గృహలక్ష్మి' పత్రికెప్పుడు వస్తుందా అంటూ కాచుకు కూర్చున్నారు ఇద్దరూను.

15 వ తారీఖు వచ్చింది. అమ్మాయింటికి 'గృహలక్ష్మి' పత్రిక వచ్చింది. అబ్బాయింటికి ఒక కవరు వచ్చింది. అబ్బాయి పరమ సంతోషంతో కవరు తెరిచేడు. ఇంకేముంది! అబ్బాయిగారికథ తిరిగి వచ్చేసింది. అబ్బాయి అమ్మాయితో జరిగిన సంగతంతా చెప్పి, "ఈసారి నాతో పందెంకొస్తావా" అన్నాడు. అమ్మాయి అంగీకరించింది. నాకథ పడకపోతే నేను చెవి కోసుకుంటా, నువ్వుకూడా కోసుకుంటావా అన్నాడబ్బాయి. సరే అని అంగీకరించిందమ్మాయి. ఇద్దరూ పంపేరు. 15 వ తారీఖు వచ్చింది. 'గృహలక్ష్మి' పుస్తకం అబ్బాయింటికి వచ్చింది. ఈసారి అమ్మాయింటికి కవరు వచ్చింది. అమ్మాయి కవరు తెరిచి చూసింది. అమ్మాయికథ తిరిగి వచ్చేసింది. అబ్బాయికథ 'గృహలక్ష్మి'లో ముద్రించబడింది. అబ్బాయి గబగబా అమ్మాయింటికెళ్ళి 'నీకథ పడలేదు కాబట్టి చెవి కోసుకో' అన్నాడబ్బాయి. అమ్మాయంగీకరించింది అబ్బాయి చుట్టుపట్ల వాళ్ళందరినీ పిలిచి తీసుకొచ్చేడు. అంతమందీ, చెవి అమ్మాయి ఎలా కోసుకుంటుందో చూద్దామని వచ్చేరు. అమ్మాయి కత్తి పట్టుకొచ్చి "ఇదుగో చెవి కోసుకుంటున్నాను" అంటూ దన మెళ్లో తాళంచెవికి కట్టిన త్రాడును కోసేసింది. అంతమంది తెల్లబోయి చూస్తున్నారు. అబ్బాయి "ఇదేమిటి చెవి కోసుకుంటానని తాళంచెవి కోశావు?" అన్నాడు. అమ్మాయి "నీకదంతా అనవసరం. చెవి కోసుకుంటానన్నాను కదా. చెవి కోసేనా లేదా" అన్న మాటలు అబ్బాయి గుండెల్లో బల్లేల్లా మూనుకు పోయేయి.

# భారత క్షత్రియ వీరరమణి - కిరణదేవి

మూలం: లలితా సింహయాదవ్ -

అనువాదం:- శ్రీ కొనే సర్వేశ్వరరావు (జాతీయ రచనా మండలి)

పేరు పొందిన మొగలాయి చక్రవర్తి అక్బరు ప్రతిసంవత్సరం స్త్రీల కొరకు 'నౌరోజ్' (తొమ్మిది రోజులు) అనే పేరుతో ఒక ఉత్సవమును జరుపుచుండెను. ఆ వుత్సవము చూచుటకై గొప్ప గొప్ప రాజుల, నవాబులయొక్క కోడండ్లను, కుమార్తెలను ఆహ్వానించుచు అమాయకులైన వారిని మోసపుచ్చుటకై తన బేగములను (భార్యలను) కూడా వుత్సవములలోనికి పంపుచుండెడివాడు. ఇంతేకాకుండా ఆ వుత్సవములో అతని కుటనియా (స్త్రీలను మోసపుచ్చి పరపురుషుల చెంతచేర్చు స్త్రీలు) తిరుగుచు అమాయక స్త్రీలను మోసపుచ్చి అక్బరు మహాలునకు చేర్చుచుండెడివారు. తరువాత అక్బరు ఆ స్త్రీలను హింసించుటయేగాక బలాత్కరించుచుండెడివాడు.

అక్బరు దర్బారునందు దేశద్రోహులు, విలాస పురుషులు అయినటువంటి రాజపుత్రులు వుండిరి. వారిలో మానసింహుడు, బికనీరురాజుకూడా కలిశాడు. బికనీరురాజు తమ్ముని పేరు పృథ్వీసింహుడు. అతని భార్య 'కిరణదేవి' చాలా పతి భక్తురాలు. పృథ్వీసింహుడు తన అన్నగారి స్వభావాన్ని వ్యతిరేకించుచుండెడివాడు. నిజాన్ని చెప్పుటలో యితరులను యేమాత్రం లక్ష్యపెట్టేవాడు కాడు. అంతేగాకుండా యితనికి దేశభక్తి అమితం. ఇందువల్ల చివరకు అక్బరు కోపగించి భార్యతో సహితం పృథ్వీసింహుని బయటకు పోకుండా నిర్బంధించెను. ఈ విధంగా చేయుటకు కారణం లేకపోలేదు. అక్బరు కిరణదేవిపై మోహితుడైయుండి, యీమెను భ్రష్టురాలునిచేయ చూచుచుండెను. ఇందులకై అక్బరు యీమె వద్దకు తరచు తన ప్రేమ సందేశమును పంపుచుండెడివాడు. చివరకు దీనిపై రాజపుత్ర స్త్రీయైన కిరణదేవియొక్క రక్తము పొంగి పొర్లసాగి తన సతీత్వ రక్షణకొరకు "చచ్చుటో లేక చంపుటో" జరుగవలెనని నిశ్చయించుకొని యెల్లప్పుడు తన యొద్ద యొక పదునైన బాకు జాగ్రత్త పరచుచుండెను. ఇంతేగాకుండా ఆమె "నేను బాదుషాను (అక్బరును) మంచి దారికి తెస్తా, లేదా యీ ప్రపంచమునుండి వానిని అంతంచేస్తా"నని ప్రతిజ్ఞ చేసెను.

'నౌరోజ్' వుత్సవము జరుగుచుండెను. అక్బరుయొక్క కుటనియాః యిటు అటూ పరుగులెత్తసాగిరి. రాజుల నవాబుల కోడండ్లు, కుమార్తెలు వుత్సవములో పాల్గొనుచుండిరి. అక్బరు కూడా స్త్రీ వేషము ధరించి అందులో అటుయిటు తిరుగాడుచుండెను. ఇంతలో కిరణదేవి ఒక ధాసిని వెంట తీసుకొని వుత్సవములో ప్రవేశించెను. కొంతసేపు అటు యిటు తిరిగిన మీదట తిరిగి వెనుకకు చూచునప్పటికి దాసి యెచ్చటను కనిపించలేదు. అది దారిలోనే యెక్కడనో తప్పిపోయి వుండెను. కిరణదేవికి దాసి కనిపించక పోవుటచే చాలా గాబరా కలిగెను. ఇట్టి సమయమున అచ్చటకు ఒక కుటనీవచ్చి-సోదరీ! భయపడకండి. రాజమహాలునకువచ్చి కూర్చోని బేగము సాహెబాతో మాట్లాడుతూ వుండండి. నేను తిరిగి తమ దాసిని వెదకి తీసుకవచ్చెదననెను. కిరణదేవి కుటనీయొక్క మాటలునమ్మి ఆమెతో రాజమహాలునకు చేరెను.

అచ్చట ఒక రహస్య మార్గమును చేరగానే కుటనీ మాయమయ్యెను. దానిపై కిరణదేవి కుటనీయొక్క మాయోపాయమును గ్రహించి ధైర్యమును తెచ్చుకొని బయటకు పోవుటకై దారి వెదకసాగెను. ఇంతలో ఒక దాసివచ్చి ఆదరపూర్వకముగా "ఓసఖియా! గాబరాపడకు, భయాన్ని విడచి ఖులాసాగా మాట్లాడు" అని పలుకగా, ఆ మాటలువిన్న కిరణదేవికి తల తిరుగసాగెను. కాని ఆమె వీరవనిత యగుటచే ధైర్యమును తెచ్చుకొని చాలా తెలివిగా ఆ దాసీదాని ననుసరించెను.

కొంతసేపటికి వారిద్దరు ఒక మహాలునందు

ప్రవేశించిరి. అక్కడకు చేరినమీదట దాసీవేషము నందున్న అక్బరు తన మారువేషమును తీసివైచెను. కిరణదేవి మొదటనుండియు బహు జాగ్రత్తగా యుండుటచే తనయొద్ద దాచియుంచిన బాకును బయటకుతీసి అత్యాచారిని అంతము చేయుటకు నిలబడిన కాళికాదేవివలె ధైర్యముగా నిలబడి "దుష్టా! 'యిది దాసీదికాదు, అక్బరే' నని నేను మొదటినుండియు తలంచుటేగాక నీవు నన్ను యిచ్చుటకు యెందుకు తీసుకొని వచ్చినదికూడా యెరుగుదును; కాని జ్ఞాపకముంచుకో, నేను వీర క్షత్రియ రమణిని. ఇంతేగాకుండా నా తండ్రి చిత్తోడు రాణాప్రతాపు సింహుని సోదరుడు శక్తి సింహుడు.—పాపీ! నీ ముఖము చూచుటకూడా పాపం ... మంచిది, - నేడు నిన్ను అంతము చేసి ఈ భూమిని పవిత్రపరుస్తా"నని భీకరముగా పలికెను.

అప్పుడు అక్బరు తన ప్రాణము సంకట మందుండుట యెరిగి ఆమె పాదములచెంత కూర్చొని చేతులు జోడించి "శభాష్ కిరణదేవి! నీవు నిజమైన వీరపుత్రికవు. నీవు నేను వినినంత శూర వీరవనితవని నేనిప్పుడు యెరుగగలిగితిని. నిన్ను మోసపుచ్చదలచిన నా బుద్ధి తక్కువను యిప్పుడు నేను తెలుసుకొనగలిగితి"నని ప్రాధేయపడసాగెను.

కిరణదేవి మరల:- అరే దుష్టా! కపటీ!! రాజు ప్రజల ధర్మపితకదా! నీవు యెందుకు యీ విధంగా అనాచారాలు, అత్యాచారాలు చేస్తు న్నావు? ఖరే యిప్పుడు నిన్ను నా చేతులతోనే చంపి యీ పాపపు భారమునుండి భూమిని తేలిక పరుస్తానంటూ తన చేతిలోని బాకుతో వానిని పొడిచి వేయుటకు ప్రయత్నించబోవుచుండ అక్బరు మరల చేతులు జోడిస్తూ - "రామునిమీద ఒట్టు, నన్ను చంపవద్దు. నేటినుండి నీవు నా సోదరివి. నేను నీ సోదరుడను. ఇంక నీవు యేమి చెప్పితే అదే చేస్తా"నంటూ దీనముగా ప్రార్థింప సాగెను. కిరణదేవి:- నేడే నా దేవతయైన నా నాథునిపైనున్న నిర్బంధము తొలగించు. యీ 'నౌరోజ్' ఉత్సవము యెత్తివెయ్యి. ఇంతేగాక నేటినుండి నీవు యెల్లప్పుడు స్త్రీల సతీత్వమును రక్షిస్తానని దేవునిపై ఒట్టుబెట్టుకొనుమనెను. అక్బరు కిరణదేవియొక్క విషయములనేగాకుండా ధర్మముగా పరిపాలన చేసెదననికూడా ప్రతిజ్ఞచేసెను.

# "గృహలక్ష్మికి శుభాశీస్సులు"

ఆరవెల్లి కన్నరాజ గోపాలాచార్యులుగారు.
వజ్ఝ శ్రీమన్నారాయణగారు.



శ్రీల కాకరమైన స్త్రీలకు నేపత్రి నీతులఁ గఱపుచు నెగడుచుండె?
ముక్తిమార్గముఁ జూపు ముగ్ధల కేపత్రి ముక్తిమార్గముఁ జూపు మొనయు చుండె?
శిశురక్షణము సేయు చెలువల కేపత్రి శిశురక్షణము నేర్పి చెలఁగు చుండె?
గృహకృత్యములఁ దీర్చు గృహిణుల కేపత్రి గృహకృత్యములఁ జెప్పి కీర్తి మెఱసె?
నట్టి "గృహలక్ష్మి" కీశ్వరుఁ డాదిదేవుఁ డబ్జనాభుడు సమ్మోద మంది యెలమి
కీర్తి వైభవ మాయువుఁ బ్రీతి నిచ్చి నిచ్చలును రక్షఁ జేయుత! నిచ్చ తోడ.

శ్రీయుత కోట వంశీయుఁడౌ నరసింహముఁ బుత్రి రత్నంబవై పొడమి నావు.
నరసింహ నామంబు నరులందు నితనికి యుక్తమై నట్టుల నొనరి నావు.
స్త్రీ జనించిన యంత శ్రీల కాకరమగు నుభయాన్వయ ములన నొప్పి నావు.
ఇలనుఁ జారిత్ర్య మలవర్చ గాంతాక్షి దర్పణ రూపమై తనరినావు.
తల్లి! గృహలక్ష్మి! గృహలక్ష్మి తతుల కెల్ల దాపురంబైన కష్టముల్ తడవి తడవి
పారవేయఁగ సమకట్టి ధీర వగుచు వెలయు చుంటివి ధారుణి విలువ లేక.

అమ్మా! యో గృహలక్ష్మి! యమ్మల లోపములఁ దీర్ప నవని వెలసినా
విమ్మహి నెల్ల వేళల నుమ్మలికము మాని కఱపు మొప్పగు నీతుల్.

సావిత్రీ దమయంతి చారుమతి యా, సారస్వతీ పార్వతీ
శ్రీవామా త్వనసూయ యాదిగల యా సీమంతినీ బృందమున్
ఈవామాక్షుల కెల్లఁ దెల్పుచును సందీప్తంబుఁగా జేయుమా
భావంబందునఁ బొంగి సంతతము నంబా, దేవి, గార్హేందిరా!

కమలభవుడుఁ గమలాక్షుడుఁ గమలారి కిరీటి. మిగులఁ గరుణఁ దలిర్పన్
అమల చరిత "గృహలక్ష్మి" ని విమల యశోవిభవ మొసఁగి వెలిఁగింతు రొగిన్.



# రేడియో

## "ధన్యజీవులు" — కస్తూరిబాయి గాంధి

### శ్రీమతి సత్తిరాజు సూర్యకాంతమ్మగారు.

"గాంధీజీ, మట్టితో మహావీరులను సృష్టిస్తున్నాడ"ని గోపాలక్రిష్ణ గోఖలే అన్నమాటలలో అతిశయోక్తి ఎంతమాత్రంలేదు.

ప్రపంచ సంపర్కం వదలి, నిర్జన ప్రదేశాలకు తపోనిష్టతో జీవిత -పరమావధి పొందుటకు, మహాఋషుల మాదిరిగా, సామాన్య మానవులు పోనక్కరలేదనీ కర్మయోగులై, గృహస్థులుగనే నిత్య నిమిత్త కర్మలు చేసుకుంటూ, స్థితప్రజ్ఞులుగా, తామేకాకుండా, తమ మార్గాను సారులగు అశేష ప్రజలూ. జీవిత సాఫల్యత చెందుటకు అవకాశం ఉందనీ, గాంధీ దంపతుల జీవిత చరిత్ర నిరూపిస్తోంది.




విద్యావ్యాప్తి, ఎంత మాత్రమూలేని పల్లె పడుచువంటి సామాన్య భారతవనిత, తన నిరుపమనైతిక ప్రవర్తన, మానసిక ప్రతిపత్తులతో, అర్ధాంగిగా భర్తయొక్క గౌరవము పెంపొందచేయటానికీ, తన పురోభివృద్ధికి మెరుగులు దిద్దుకోటానికీ ఏవిధంగా సహాయపడగలదో, కస్తూరిబాయి జీవితచరిత్ర విశద పరుస్తుంది.

తన ధర్మపత్ని ఏవిధంగా ధన్యజీవి అయినదో, గాంధీజీయే "సత్యాన్వేషణ" అనే తన జీవిత చరిత్రలో, మన కందరికీ తెలియపరిచారు. పతిసేవయే పరమావధిగా, తన పురుషుని కామక్రోధ జ్వాలలకూ, అనుమాన ఈర్ష్యా పిశాచ చేష్టలకూ గురియై, అగ్ని పరీక్ష లందజేయగా, పతికి తోడునీడై నిలచిన ధన్యురాలు.

కస్తూరీబాయి, నిరక్షరకుక్షి, సహజముగ నిరాడంబరజీవి; స్వతంత్ర ప్రవర్తనాభిలాషి. ఏకార్యమునైననూ, ఓర్పుతోకూడిన పట్టుదలతో సాధించు స్వభావముగల సాధ్వి. ఈమెకు సమవయస్కుడగు గాంధీజీతో 13 వ ఏట వివాహం అయింది. హైందవ మతాచార సాంప్రదాయాలు పాటించే కుటుంబములో ఈమె జన్మించి యుండుటచే కులాచారాలు, కుటుంబ కట్టుబాట్లూ, కస్తూరీబాయి యొక్క వైవాహిక జీవితపు ప్రారంభదశలో ఎక్కువగా ప్రతిబింబించాయి. రానురాను, భర్తయొక్క ప్రోద్బలంవల్లనైతేనేమి, విజ్ఞానోదయంవల్లనైతేనేమి కొన్ని ఆచారాలను, సంఘమునకూ, దేశమునకూ ముప్పుతెచ్చే దురాచారాలుగా ఆమె విసర్జించటం, ప్రతిఘటించటంకూడా జరిగింది. ఇట్టి వాటిలో ముఖ్యమైనవి—ఘోషాపద్ధతి, అంటరాని తనము.

"కస్తూరిబాయి తన యొక్క నిర్దుష్టమగు మనోనిశ్చితత్వముచే అప్రయత్నముగా నాచేత సాధింప బడిన అహింసాత్మక సహాయనిరాకరణోద్యమ విధానము పట్లనూ, నెరవేర్పు విషయంలోనూ, నాకు గురువుగా ఉపకరించింది" అని గాంధీజీ అన్నారంటే ఆమెయొక్క మానసిక పరివర్తన ఎంత ఉదాత్త మైనదో వేరే ఊహించవలసిన అవసరం ఉండదు. ఈ మానసిక శక్తిని ప్రథమంలో గాంధీజీ అవగాహన చేసుకోలేక, మొండితనంగానూ, మూర్ఖతగానూ భావించి, కస్తూరీబాయిని అనేక ఇక్కట్ల పాలు గావించినట్లు గాంధీజీ వప్పుకుని చివరకు చాలా విచారించారు.

ఇటువంటి అనుభవం గాంధీజీకేకాదు, భారత స్త్రీ తత్వాన్ని సరిగ్గా అర్థంచేసుకోని అనేకమంది భర్తలకు కలుగుతూనేవుంటుంది, మించిపోయిన తర్వాత విచారించే వార్నికూడా అనేకుల్ని చూస్తున్నాం. ఈ జ్ఞానోదయం గాంధీజీకి 36 వ ఏట—సతీపతులు, పరస్పర అంగీకారంతో పూనుకొని జీవితాంతం వరకూ నిర్వహించిన బ్రహ్మచర్యదీక్షవల్ల—కలిగినదని మహాత్ముడే నిర్వచించారు. 'నేను,' 'నాది' అనే స్వార్థకాంక్ష తొలగినప్పుడే ఇతరులను పూర్తిగా అర్థంచేసుకో గల్గుతాము. ఇంద్రియ నిగ్రహంతో, అరిషడ్వర్గాన్ని జయించగలం. ముఖ్యంగా 'మోహ, మద, మాత్సర్యాలు' బ్రహ్మచర్యంవల్ల జయింప బడతాయి. బుద్ధి వికసిస్తుంది.

భారత స్త్రీకి అమూల్యాభరణమై, ప్రపంచ స్త్రీ జాతిలో అత్యున్నత స్థానము చేకూర్చిన 'పతిభక్తి' కస్తూరి బాయికి ఉగ్గుపాలతో అలవడిన అంగరక్ష. గాంధి దంపతుల వివాహం జరిగిన రోజుల్లో ప్రచురింపబడ్డ సూక్తి ప్రబోధకములైన కాని-అర్థణా-చవక ప్రచురణలు చదివి, ఏకపత్నీత్వ దీక్షపూని, గాంధీజీ తన భార్యకూడా అణకువతో తనకు పూర్తిగా విధేయురాలుగా ఉండాలనే వాంఛతో, సహజంగా స్వతంత్ర పిపాసియైన కస్తూరీబాయిని నిర్బంధించినకొద్దీ ఆమె ప్రతిఘటిస్తూ రావటంవల్ల, భార్యాభర్తల మధ్య అనేక సార్లు వైషమ్యాలు ఏర్పడ్డాయి, కాని ఉభయులూ పరస్పరం గాఢంగా ప్రేమించుకుంటూ ఉండటంవల్ల అవి ప్రణయ కలహాలు మాత్రమే కాగలిగాయి. అప్పుడు సామాన్య మానవుడైన గాంధీ, పురుష స్వభావమైన ఈర్ష్యను చంపుకోలేక ఒక స్నేహితుని దుర్బోధలకులోనై, అమాయకపు అబల కస్తూరీబాయిని, హింసాయుతమైన నిర్బంధనలపాలు చేయటం కూడా జరిగింది. "ఈ బాధలు హిందూ భార్యలు మాత్రమే సహించగలరు. అందుచేతనే, భారత స్త్రీ సహన శక్తికి అవతారముగా నేను పరిగణించి పూజిస్తాను. నా భార్యను అనుమానముచే క్రోధాగ్నికి ఆహుతిచేసిన అపరాధమును మరచి నన్ను నేను క్షమించుకోలేను" అని గాంధీజీ వ్రాశారు. శ్రుతి మించకముందే భారతస్త్రీల పాతివ్రత్య పటిమ గుర్తించి — భర్తలు వైవాహిక జీవితాన్ని, గాంధి దంపతుల పూర్వోత్తర జీవితం జ్ఞప్తియందుంచుకుని సుఖప్రదంగా చేసుకుంటే ఎంత బాగుంటుందో వేరే చెప్పాలా ?

కస్తూరీబాయికి చదువునేర్పి ఆదర్శ భార్యగా చేయాలని గాంధీజీ అనుకునే వారట. కాని ఇప్పటికీ మన కుటుంబాలలో చాలా వాటిలో ఉంటున్నట్లు పగలు ముఖాముఖిగా భార్యలు తమ భర్తల ఎదుటపడి మాట్లాడటానికికూడా శంకించే ఆచారం వారి కుటుంబంలోకూడా ప్రబలి ఉండటం చేతనూ, రాత్రులందు దంపతుల వృథాసరస సల్లాపాలతోనూ, ఆమెకు చదువునేర్పే అవకాశం కలుగ లేదు. మేష్టరునైనా ఏర్పాటుచేసి చదువు చెప్పించకపోతినే అని గాంధీ చాలా విచారించారు. తరువాత ఆమెయే కొద్దిగా గుజరాతీ చదవటం వ్రాయటం నేర్చుకుంది. అంతే.

ఈ ధన్యదంపతుల జీవిత చరిత్రలోని కొన్ని సంఘటనలు ఏవిధంగా గాంధీజీకి మార్గదర్శకంగా ఉపయోగపడినదీ కొంత తెలుసుకుందాం. దక్షిణ ఆఫ్రికాలో గాంధీ దంపతులు కాపురం చేస్తున్న ప్పుడు, తను ఏవిధంగా ఉంటున్నారో అదే విధంగా తన భార్యకూడా ఉండేటట్టు చేయాలనే సంక ల్పంతో, గాంధీజీ తన ఇంట్లో వర్ణవిచక్షణలేకుండా భోజన వసతులు పొందుచున్న గుమాస్తాలలో,

క్రొత్తగా వచ్చిన ఒక క్రైస్తవ గుమాస్తాయొక్క మూత్రవిసర్జన పాత్రను శుభ్రపరచమని కస్తూరీబాయిని నియోగించినప్పుడు ఆమె ఈ అనాచారాన్ని భరించలేక పోయింది. హృదయపూర్వకంగా ఆ పాత్రను తీసుకపోవటం గమనించి, గాంధీకి వళ్ళుమండి భార్యను దూషించి, ఇంట్లోంచి ఆ ఇల్లాలిని బైటకు గెంటివేసేటందుకు, చెయ్యిపట్టుకుని గుమ్మం వద్దకు ఈడ్చుకు వెళ్ళగా, ఆ పతివ్రత సహించలేక, పొంగి పొరలే పవిత్రాగ్రహపు కన్నీటిబిందు ప్రవాహంలో, ఆయన అవ్యక్త ప్రవర్తనను, బల్లెపుపోట్లలాగున తనపతి హృదయానికి నాటేటట్లు "మీరు ఇంత మైమరచి ప్రవర్తిస్తారా? సిగ్గు, అభిమానం మీకు లేదా? నన్నెక్కడికి పొమ్మంటారు? నాకు వేరే ఇక్కడ దిక్కెవరు? భార్య, భర్తయొక్క చీవాట్లు తన్నులూ భరించి పడిఉండాలని అనుకుంటున్నారా? చాల్చాలు; ఎవరైనా చూస్తే నవ్వి పోతారు. తలుపు వేసెయ్యండి! ఇప్పటినించేనా సరిగా ప్రవర్తించండి" అని గంభీర గద్గద స్వరాలతో భర్తకు హితబోధచేసిన మానవతి గాంధీజీ ఖిన్నుడై పోయారు. భర్తయొక్క కర్తవ్యం అప్పటినుంచీ సరిగ్గా గ్రహించి ప్రవర్తించారు.

నేటాలు ప్రజలు బహూకరించిన వస్తువుల్లో కస్తూరీబాయికిగాను విలువగల బంగారు హారం ఇవ్వబడింది. అన్ని వస్తువులతోపాటు ఈ గొలుసుకూడా మళ్ళీ నేటాలు ప్రజలకే ఒక నిధి ఏర్పాటుచేసి ఇచ్చివేయాలని గాంధీజీ సంకల్పించారు. కాని కస్తూరీబాయిని ఒప్పించటం కష్టసాధ్యమయింది. ఆ గొలుసు ఇచ్చివేయటానికి ఆమె అంగీకరించలేదు. "నా పిల్లలకు పెళ్ళిళ్లుకావాలి, కోడళ్లకి వస్తువులు పెట్టొద్దా? నాకు ఏమీ ఆభరణాలు లేకుండా చేయనేచేశారు. కోడళ్లకైనా వస్తువులు లేకుండా చేస్తారా? నాకు బహూకరించిన గొలుసు నాది; నేనివ్వను. దాన్ని ఇవ్వమనటానికి మీకు ఏమి అధికారం ఉంది? మీరు నా పిల్లల్నికూడా బైరాగుల్ని చేయటానికి ప్రయత్నిస్తున్నారు. మీతోపాటు నేటాలు ప్రజలకి రాత్రింబవళ్లు నేనూ సేవచేసాను. ఆ సేవాఫలితంగా వారు నాకిచ్చిన బహుమతి నా స్వంతం" అంటూ ఆమె చాలా పట్టుపట్టింది. కాని లాభంలేకపోయింది. ఇచ్చెయ్యమని పిల్లలుకూడా పట్టుపట్టి ఆ గొలుసును ఇప్పించేసారు. పాపం ఎంత అమాయికపు మాతృప్రేమో?

ఆఫ్రికాలో చాలా జబ్బుచేసి, రక్తస్రావముతో ప్రమాదస్థితి యందున్నప్పుడు 'బీఫ్‌టీ' అనే మాంససంబంధమైన పానీయం ఇస్తేనేగాని ఆమె బ్రతకటం కష్టం అని వైద్యులు చెప్పినా, పండితులు శాస్త్రసమ్మతమని నచ్చచెప్పినా — ససేమిరా — 'బీఫ్‌టీ' తీసుకోటానికి కస్తూరిబాయి ఒప్పుకోలేదు. భర్తతో "మీ చేతుల్లో ప్రాణాలైనా వదుల్తానుగాని మాంసం తీసుకోను" అని నిరాకరించిన ధీరురాలు.

భర్త ప్రోత్సాహంలేకుండా, తనంతటతానే, సత్యాగ్రహ సమర రంగంలో దుమికి, ఖైదులలో కష్టాలు అనుభవించింది. "మీరూ, నా కుమాళ్లూ, కష్టాలు భరిస్తూఉంటే నేను మాత్రం భరించలేననుకున్నారా?" అని గాంధీతో తర్కించి, కారాగారవాసం చేసిన వీరవనిత.

హైందవ మతాచార సాంప్రదాయమై భారత స్త్రీకి విశిష్ట విఖ్యాతి చేకూర్చిన, పాతివ్రత్యం, పతి అడుగుజాడలలో సంచరించటం అనేలక్షణము, కస్తూరిబాయి ప్రవర్తనయందు మూర్తీభవించిందని మహాత్ముడే అన్నారంటే ఆశ్చర్యం ఏముంటుంది?

పేరు ప్రతిష్టలకు ఆమె ప్రాకులాడలేదు. "నాతో ఎందుకు పడరాని ఇడుములు పడతావు, నీ పిల్లలూ మనుమలూ నీవూ, వారందరితో సుఖించరాదా?" అని భర్త ఎంత చెప్పినా వినక, 'త్వమేవశరణం' అని గాంధీజీకి నిజమైన అర్ధాంగిగా, సహధర్మచారిణిగా భౌతిక సుఖాలు పరిత్యజించి, స్వాతంత్రేచ్ఛనూ, ఆత్మగౌరవాన్ని కాపాడుకుంటూ, నిరాడంబర సేవాయుతమైన సంతృప్తజీవితంగడిపి, పసుపు కుంకుమలతో పతి బాహువులలో 75 వ ఏట 22 ఫిబ్రవరి 1944 తేదీని మహాశివరాత్రినాడు, పూనావద్ద అగాఖాన్ భవనంలో ఖైదీగా పరమపదించిన ధన్యజీవి కస్తూరిబాయి.

(A I R అనుమతిని)

---

# పుష్ప

శ్రీపూరి.

కొమ్మల లోపల నక్కియు
కమ్మని తావులను దిశలఁ గమనీయ గతిన్
గుమ్మనఁ జిమ్మఁగ దుమ్మెద
ఝుమ్మనఁగా వచ్చు నీదు సరసకుఁ బువ్వా!

ఎంత సువాసన ల్గలుగ నేమి ఫలంబగు నీకుఁ జిత్తవి
శ్రాంతియె శూన్యమయ్యె; నగు, రాజవరుండును లేక తారకా
సంతతి యెంత వెల్గిన నిశాసతి చిత్తము సమ్మతించు నే
కాంతుఁడు లేని నీకు నటుగాదె? సుమంబ! తలంచి చూచినన్.

కమ్మని తేనియ ల్గలుఁగి కంటికి మంటికి నేక ధారలై
గ్రమ్ముచు జాలువారి పెను కాల్వలు గట్టఁగ నేడ్వ నేల? ల
భమ్మిసుమంత లేదు; సరి వారలు నవ్వరె గాక, కాన, పు
ష్పమ్మ పరిమళమ్ము లను బాయక చిమ్ముము దేశదేశముల్.

మధు మయాంతస్సుఁ గల కుమారుని గని -
వాని సౌభాగ్యమును చూచు ప్రాప్తి లేక,
తనువుఁ బురిటింటఁ బాసిన తరుణి వోలె
పురుడు తిరుగక చత్తువే; పువ్వ! నీవు.

తెమ్మెర లోన లీనమయి తియ్యని నీదు సువాసనా తరం
గమ్ములు చిమ్మ దిక్కుల సుఖంబుగ వచ్చియు గ్రోలి, నీమరం
దమ్మును తుమ్మెదల్ తమకు దాహము తీరిన, తృప్తినంది గా
న మ్మొనరించు నీయశము నాడుచు దిక్కుల గాంచు పుష్పమా!

పైకి ముఖ మట్టులే పెట్టి వంచకుండ
దేనికొఱ కీవు చూచెదో తెలియదమ్మ!
అందరానట్టి పండ్లకు నఱ్ఱు చాప
ఆశ లీడేఱునా కాని దురాశ గాక!

# బాలప్రహ్లాద

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

(1948-అక్టోబరు సంచిక తరువాయి)

## ౪ రంగము

(లీలావతి అంతఃపురము. లీలావతీ ప్రహ్లాదులు సంభాషిస్తుంటారు.)

ప్ర:-అమ్మా! అమ్మా! ఆచార్యులువారు నన్ను చక్కగా అలంకరించుకొని రమ్మన్నారు.

లీ.-ఎందుకు నాయనా?

ప్ర.-ఆచార్యులువారు నన్ను నాన్నగారి వద్దకు తీసుకొనిపోయి నా విద్యాప్రదర్శనం చేయిస్తారుట.

లీ:-నా తండ్రే! అట్లాగే వెళ్లుదువుగాని, చక్కగా ముస్తాబుచేసి పంపుతాను, కాని బాబూ! నీవు నాన్నగారివద్దకు పోతానంటే నాకు భయమేస్తున్నదిరా. (అని విచారంతో తల నిమురుతూ కండ్లనీళ్లు పెట్టుకుంటుంది.)

ప్ర.-భయమెందుకమ్మా?

లీ.-నీవు చెప్పిన మాటలు మీ తండ్రిగారికి నచ్చకపోతే నిన్నేమి శిక్షిస్తారో అని.

ప్ర:-హరిభక్తులకు శిక్షాభయమేమిటమ్మా! ఒక్కమారు హరినామస్మరణ జేస్తేనా సమస్తబాధలు పటాపంచలౌతాయి.

లీ.-(మతికొంచెం భయంతో, దుఃఖంతో) అయ్యో! నాయనా! ఆ శ్రీహరి నామోచ్చారణ చేస్తావేమోననే నా భయం. ఆ నారాయణుని పేరెత్తకపోతే, నీకు చదువు రాకపోయినా మీ తండ్రిగారు నిన్నేమీ అనరు. తండ్రీ! నిన్ను గడ్డం పట్టుకొని బ్రతిమలాడుతాను. ఆ వైకుంఠుడిపేరు మాత్రం మీ జనకుని సమక్షాన తలబెట్టబోకు. ఆ గోవిందుడనిన మీ నాయనగారి కపరిమిత కోపం. ఆ కేశవుడు మీ పినతండ్రిని సంహరించాడు; తెలుసునా.

ప్ర:-దుష్టశిక్షణము భగవంతుని కర్తవ్యముగదా. వేల్పులను సాధువులను తాపసులను స్త్రీలను హింసిస్తూ లోకకంటకుడై భూమిని చాపగా చుట్టడానికి పూనుకున్నాడటగదా అతడు. లోకానికి యింత ఉపద్రవం కలుగజేస్తూఉంటే జగద్రక్షకుడైన హరి చూస్తూ ఊరుకుంటాడమ్మా? ఇందులో శ్రీహరి తప్పేమున్నది? మొన్న మన గృహారామంలోకి విషసర్పం వస్తే నీవూ నాన్నగారూ దగ్గరఉండి చంపించారు గదా!

లీ.-అవును దానివల్ల మన కెవరికైనా అపాయం కలుగుతుందేమోనని.



ప్ర:- ఒకరిద్దరకు అపాయం కలుగబోతుందని ఆ సర్పమును అంత నిష్కారణంగా చంపించారు గదా. ముల్లోకములకు పీడ కలుగజేస్తున్న పినతండ్రిని చంపకుండా ఎట్లా ఉంటాడమ్మా, వైకుంఠుడు, ఆయన జగద్రక్షకుడుగదా.

లీ:- మంచో, చెడ్డో ఎవరివాళ్లు వాళ్లకు ఉండవలెనని ఉంటుందిగదా నాయనా. అందులో మహాబలాఢ్యుడూ, విశ్వాసపాత్రుడూ అయిన తన సహోదరుడు జీవించిఉండి, పెట్టని కోటవలె తనకు తోడ్పడుతూ ఉంటే తన త్రిలోకాధిపత్యము నిరుపద్రవమై శాశ్వతంగా ఉండేదిగదా అని మీనాన్నగారి ఉద్దేశము. తమ్ముడిని చంపినది మొదలు మీనాయనగారికి ఆ శ్రీహరిపై గల పగ యినుమడించింది.

ప్ర:- నాన్నగారికి కోపంఉంటే ఉండవచ్చుగాని యిందులో న్యాయంలేదు.

లీ:- కుమారా! మీ నాన్నగారు మహాబలాఢ్యులు, మహాసమర్థులు. త్రిదశాధిపతియైన దేవేంద్రుని పదభ్రష్టుణ్ణిచేసి దేవేంద్ర పీఠం కైవశంచేసుకున్నారు. దిక్పాలకులను దిక్కులకు తోలారు. వేల్పులచే వెట్టి చేయించారు. స్వర్గమర్త్య పాతాళములనే మూడులోకములు ఆయన యేలుబడిలో ఉన్నాయి. సూర్యచంద్రాది గ్రహములూ, పృథివ్యాపస్తేజో వాయురాకాశములనే పంచమహాభూతములు ఆయన పిడికిటిలో ఉన్నవి. కనుకనే త్రిజగంబులవారు ఆయనే దేవుడని ఆయనను కొలుస్తున్నారు.

ప్ర:- అమ్మా! నాయనగారే దేవుడైతే బ్రహ్మవల్ల వరము లెందుకు పొందారు? శివునెందుకు ఆరాధిస్తారు?

లీ:- వారిని మోసగించుటకే!

ప్ర:- నేను నమ్మను.

లీ:- అదేమి ప్రహ్లాదా?

ప్ర:- శ్రీహరివలన తండ్రిగారికి భయమున్నది.

లీ:- ఉన్నదేమో! ఆ మాట నీ కెందుకు?

ప్ర:- అటులైన ఆ మహావిష్ణువునే నమ్ముకుంటే భయములేని బ్రతుకు బ్రతుకవచ్చునుగదా.

లీ:- కుమారా! నీ ఊహ లెట్లాగైనా ఉండనీ. ఆ శ్రీహరి ప్రశంస మాత్రం మీ తండ్రికడ చేయబోకు. ఆయన మహాకఠినుడు తన బిడ్డ గదా అని దయచూచే తలంపులేదు. తనకు ప్రబల శత్రువైన శ్రీహరిని నీవు భక్తి చేయుచున్నావని గట్టిగా నమ్మెనా నిన్ను బహువిధాల హింసించి తీర్తాడు. నా కన్నతండ్రీ ప్రహ్లాదా! నిన్ను హింసిస్తూఉంటే చూడనూలేను, చండశాసనుడైన మీ తండ్రికి చెప్పనూలేను. నాయనా నా మాటవిని ఆ నారాయణ నామోచ్చారణ మీ తండ్రి సమక్షాన చేయబోకు. తండ్రీ! చేయవుగద? చేయవుగద చెప్పు, చెప్పు కుమారా! చెప్పు, చెప్పు! (అని ప్రహ్లాదుని ఒడిలోకి తీసుకొని వాని తలపై తన చెక్కిలి ఆనించి తల నిమురుతూ విలపిస్తుంది. ప్రహ్లాదుడేమీ మాట్లాడకుండా తల్లి ఒడిలోదూరి తలవంచుకొని కూర్చుంటాడు. ఒక నిముషమైన తర్వాత)

లీ:- ప్రహ్లాద్!

ప్ర:- అమ్మా!

లీ:- నారాయణ నామస్మరణ మానుతావా?

ప్ర:- మానలేనమ్మా.

లీ:- మీ నాన్నగారి వద్దనైనా.

ప్ర:- ఒక ప్రాణి మాత్రుడికి భయపడి భగవంతుని స్మరించని వాడెట్టి భక్తుడమ్మా.

లీ:- మీ తండ్రివల్ల నీకు మహాపద ప్రాప్తిస్తే?

ప్ర:- ఆ శ్రీహరి కరుణ.

లీ:- అయ్యో! ప్రహ్లాద్! నా కడుపులో చిచ్చుపెట్టేస్తున్నావు! ఇది ఎట్లా చల్లార్చుకోను తండ్రీ!

ప్ర:- భగవన్నామ స్మరణ చేయి తల్లీ!

లీ:- నేను గూడానా?

ప్ర:- సమస్త ప్రాణికోటికి దుఃఖనివారకౌషధమదే గదా.

లీ:- అయ్యో పిచ్చి తండ్రీ! (అని తీవ్రంగా దుఃఖిస్తుంది.)

(తెర)

# వేదాంతం ★ శ్రీమతి శ్రీనివాసమ్మగారు (నవ్యకళాసమితి)

బ్రతుకుబుద్బుదము
బొమ్మలాటయిది
చీకుచింతలతో
ప్రేవులమూటతో
నలిగిపోవుటే
కులికిపోవుటే
కనబడుచున్నది ;
అనబడుచున్నది !

దాటలేవువిధి
మున్నెనొసటన
వ్రాయబడెను, నీ
భాగ్యరేఖలు
అన్నమాటలకు
ఆవలించకు
కాకమానదు ,
రాకమానదు !

ఒక్కరెరుంగరు
మున్ముందేమవో.
ఊహాగానము
లోకముగాధ
ఆసలమునిగి
అలసటపడకు
ప్రాణముపోదు ;
మానమురాదు !

సృష్టిరహస్యము
కష్టములేకను
మసీదు చర్చిలు
గుళ్లు గోపురాల్
పొలికేకలతో
తొలికూతలతో
చెవిలో పడదు ;
చెంతకు రాదు !

ఎక్కువఆలో
చించినకొలదీ
ఎదలో పులక
మదిలో బెడద
ఈఎడారిలో
ఎటుపోవాలో
లాభంలేదు ;
తాపంవలదు !

రేపునాడీయని
చెప్పుకొంటకు
పూచీ లేదీ
పూటచింతకు
స్వస్తివాచకము
పలుకడెందము
పొంగుచున్నది ;
ఉబుకుచున్నది !

కలిమిలేములు
కడలిపొంగులు
ఈశ్వరేచ్ఛయని
నిరాశపడక
కలతమాని, కా
కర్మవీరుడవు
సత్యమియ్యది ;
నిత్యమియ్యది !

నా 'నవ్యకవి' నుండి

# నా చిన్ననాటి ముచ్చట్లు

డా॥ కే. ఎన్. కేసరి

## నా చిన్ననాటి చెన్నపట్నం

నేను చిన్ననాడిక్కడికి వచ్చినప్పుడు చెన్నపట్నము ఈస్థితిలో లేదు. నాటికి నేటికి 60సం॥లు పైన గడిచినవి. ఈ 60సం॥ లలో ఎన్నియోమార్పులు నా కండ్లయెదుటనే జరిగిపోయినవి. కావున నాటి పట్నపు స్థితిగతులు, నా ఎరుకలో జరిగినమార్పులు ఈ కాలము వారికి తెలియతగినవి కావున వివరింతును.

### సముద్ర తీరము

ఆరోజులలో సముద్రమునకు కోటకుమధ్య ఇంతదూరము కాళీస్థళము లేదు. సముద్రపుఅలలు దాదాపు కోటగోడలవరకువచ్చి కొట్టుకొనుచుండేవి. కోటచుట్టుఉండే అగడ్తలనిండా నీరుండేది. ఇప్పుడు స్వరాజ్యపతాకము ఎగురుచుండు స్తంభముననే ఆంగ్లేయుల యూనియన్ జాక్ పతాకము ఎగురుచుండెడిది. కోటయొక్క అన్నిముఖ ద్వారములందును యూరపియన్ సిపాయీలు విచ్చుకత్తులతో పహరాలిచ్చేవారు. అప్పు డప్పుడు కోటమైదానమునందు సోల్జర్ల కవాతు జరుగుచుండెడిది. ఈకవాతును చూచుటకు పురజనులు గుంపులు గుంపులుగా పరుగిడుచుండిరి. నేను వచ్చుటకు కొంచము ముందు గానే 1884 ప్రాంతమున ప్రస్తుతము 'మెరినా'అని పిలువబడు అందమైన 'బీచి' కట్టబడినది. అయితే వాటిరోజులలో పురుషులేతప్ప స్త్రీలు బీచిషికారులకు నిర్భయముగా వెళ్లగలిగే వారుకారు. ఏలననగా అవివాహితులైన యూరపియన్లు చిన్నవయస్సువారు వంటరిగా నీదేశమునకు సోల్జర్లుగవచ్చేవారు; వారినిచూచి మనదేశీయులు జంకేవారు. వారెప్పుడైన జట్లు జట్లుగా పట్నపువీధులలో తిరుగునప్పుడు నగరవాసులు పలువురు తమ ఇండ్లవాకిళ్లు మూసి లోపల కూర్చుండి వారువెళ్లిపోయిన తర్వాత తీసేవారు.

అప్పుడప్పుడే మద్రాసుహార్బరుకట్టుట ప్రారంభమైనది. నాడు సముద్రపు ప్రయాణీకులు స్టీమరు నెక్కుటకు నేడున్న సౌకర్యములులేవు. పాతఇనుపవారధినుండి క్రింద నీళ్లలోనికి నిచ్చెనఉండేది. దానిమీదినుంచి చిన్నలుపెద్దలు గడగడలాడుచు క్రిందనుండు

చిన్నబోట్లలోనికి దిగేవారు. ఆబోట్లు అలలతో కొట్టుకొనుచుండగా కొంతదూరమున నున్న పెద్దస్టీమరువద్దకువెళ్లి దానిలోనికెక్కేవారు. శని ఆదివారములందు బడిపిల్లలము ఆ యినుపవారధిమీదికి షికారువెళ్లి ఈ తమాషా అంతయుచూచి ఆనందించేవారము. సముద్రుడు అనుగ్రహించి క్రమముగా వెనుకకు జరుగుచు పురజనులకు ఖాళీస్థలము నిచ్చుచున్నాడు. ఏమో, ఎప్పుడు ఆగ్రహించి మరల ముందుకురుకునో? అప్పుడేమేమి మార్పులు కలుగునో?

## పురవరిశుభ్రత

నేను ఈపట్టణమునకు వచ్చినప్పుడు ఇక్కడి వీధులు గుంటమిట్టలుగ నుండెను. వర్షముకురిసినప్పుడు వీధులనుండి నీరుపోవుటకు సరియైన సైడు కాలువలు లేవు; అవిపిదప సం॥ములలో కట్టబడినవి. వాననీరు నడివీధులలో నున్న గుంటలలో నిండెడివి. ఆ నీరు సూర్యరశ్మికే ఆరిపోవలయును. ఆలోపలదోమలుచేరి జుమ్మనితిరుగుచుండెడివి. ఎప్పుడైనా మునిసిపాలిటీవారు దోవలచేసి ఈవర్షపునిలువనీటిని ఆవలపోవుటకు మార్గము చూపే వారు. ఇండ్లలోని మురికినీరుపోవుటకు మునిసిపాలిటీవారు పెద్దకాలువలను నడివీధులలో త్రివ్వించి గారచేయించి — పైన నల్లబండలువేసి మూసేవారు. వానకాలమున ఈరోడ్డు అడుగుకాలువలు నీటితోనిండి పైకుబికి రోడ్లంతయు నీటిమయమై తెప్పతిరునాళ్లగా నుండెడిది. ఇండ్లలో ఊడ్చిన చెత్తచెదారము వేయుటకు నాడు వీధులలో కుప్పతొట్లులేవు. మునిసిపాలిటీవారు కుప్పబండ్లను తీసుకొనివచ్చి, గృహస్థులు వీధులలోపారబోయించు కుప్పలను వానిలో ఎత్తుకొనివెళ్లేవారు. ఇండ్లలో ఊడ్చినకుప్పను, మరుగుదొడ్లలోని మలమును కూడ ఒకేబండిలోనే తీసికొనివెళ్లేవారు. గుంటమిట్టలుగల రోడ్డున ఆబండి ఎగిరెగిరిపడుచుపోవునప్పుడు దానినుండి పెంట వీధులవెంటచింది అసహ్యముగానుండెడిది.

నాకు తెలిసి వీధులలో కిర్సనాయిలు దీపములను వెలిగించుట జరుగుచుండెను. ఆ దీపస్తంభములు దూరదూరముగనేయుండెను. దీపములను వెలిగించువారు మునిసిపాలిటీ వా రిచ్చిననూనెను పూర్తిగా ఉపయోగించని కారణమున ఆ గుడ్డిదీపములు త్వరగానే ఆరిపోయేవి. పట్నం త్వరగా చీకటిపడుచుండెను. పిదప గ్యాసులైట్లు వచ్చినవి. 1910 వరకున్నూ గ్యాసులైట్లే వెల్గినవి. అప్పుడు ఈ విద్యుచ్ఛక్తి దీపములు వెలిసినవి.

## వంకర తలపాగాలవారు

ఆ కాలమున చెన్నపట్నములో పాతకాలపుశెట్లు, నాయుళ్లు, మొదలియార్లు మొదలగువారందరు ఒకవిధమగు తలపాగాలను ధరించుచుండిరి. ఆతలపాగాగుడ్డ జానెడు

వెడల్పునుకల్గి సుమారు 30 లేక 40 మూరలపొడవుఉండెడివి. ఈపాగాలు వివిధరంగులలో యుండును. ఈ తలపాగాగుడ్డను ఆకాలమునందు ప్రత్యేకముగ అంగళ్లయందు అమ్ముచుండిరి. ఈ తలపాగాను చుట్టు మనిషి యింటింటికివచ్చి తలకు వంకరపాగాను చుట్టిపోవుచుండెను. ఈవంకరపాగా చుట్టినందుకు వీనికి ఒకఅణా మొదలు రెండుఅణాల వరకు కూలి ఇవ్వవలెను.

### తలంటువారు

ఆరోజులలో జార్జిటౌనునందు తలంటి స్నానముచేయించు జెట్టివాడొకడుండెను. అతనిపేరు రామదాసు. ఇతడు లావుపాటి భారీమనిషి. నల్లగ పోతవిగ్రహమువలె నుండువాడు. నుదుట వెడల్పాటి నామమును ధరించి రామనామస్మరణజేయుచు వరదాముత్తియప్పన్ వీధి(వరదాముత్తియప్ప అనే తెలుగు వైశ్యునిపేర నీవీధివెలిసినది. ఇతను 18-వ శ॥ ములో నొకవర్తకుడు. తెలుగులోనే రికార్డులలోదస్కతు చేసియున్నాడు)యందుకూర్చుండి యుండువాడు. అతడువచ్చి తలంటిన ఆకాలమున గొప్పగౌరవము. వాడుచక్కగ వళ్లుపట్టి రామదాసుకీర్తనలను శ్రావ్యముగా పాడుచు దరువుతో తలంటేవాడు. ఇతో డందరికీ సులభముగా దొరికేవాడు కాడు. ఇతనికి చార్జి రు 0-4-0 మాత్రమే. ఆ రోజులలో తలంటి వళ్లుపట్టు జెట్టీలు అనేకులుండిరిగాని ఈ రామదాసుకుండిన పేరు,గిరాకి వారికిలేదు.

### చెవిలో గుబిలితీయువాడు

మరియొకడు చెవిలో గుబిలినితీసి మందువేసిపోయేవాడు. వీడు రెండుచెవుల పైనను గుబిలికడ్డీలను, దూదిచుట్టిన పుల్లలనుపెట్టుకొని వీధి వీధికి తిరుగుచుండేవాడు. చెవులలో వేయుమందుకూడ వీనివద్దనేయుండేది. ఇట్టివారిని నేడును మనము చూడవచ్చును. వీరిలో కొందరు రాళ్లను గూడ తీసి హెచ్చురేటు పుచ్చుకొనువారు. అసలు చెవులోరాళ్లు ఉండవనియు, వీరే హస్తలాఘుమున గుబిలి తీయునపుడే చిన్నరాళ్లను చెవులలోవేసి పిదప తీసి చూపుచుందురనియు అందురు.

### పాతబండ్లు

ఆకాలమున చెన్నపట్నమున గుర్రములనుకట్టు పెట్టెబండ్లు ఉండేవి. ఇవి కూర్చుండుటకు చాలా అసౌకర్యముగా ఉండేవి. ఆ పెట్టెజట్కాలు క్రమంగా మారి నేటిగూడు జట్కాలు అయినవి. వీటిని వేలూర్జట్కాలు అని అప్పుడు అనేవారు. ఆకాలపు జట్కాలలో కూర్చుండిన ముందువారు వెనుకవారిమీద పడునట్లు ఏటవాలుగానుండెడివి. ఈ పెట్టెబండ్లు—రెండెద్దులబండ్లున్నూ ఉండేవి.

నాటికి నేటికి మారనిది వంటెద్దు గూడుబండి, రేఖలాబండి. 'రేఖలా' అనగా రెండు తేలికైన చిన్నచక్రములు కలిగియుండును. ఇరుసుపైన ఒక్కరుకూర్చుండుటకు తగిన ఆసనము అమర్చబడియుండును. ఒక్కొక్కప్పుడు ఆ చిన్నసీటుమీదనే—ముందు వైపుతిరిగికూర్చుండి బండితోలువాని వీపునకువీపునానించి పిల్లకాయలు కూర్చుండేవారు. దీనికి అందమైన పుంగనూరు పొట్టిఎద్దును కట్టుదురు. బండి తేలిక, ఎద్దుచురుకైనది. తోలేవాని చలాకీకొద్ది ఈ బండి అతివేగముగా పోవును. అప్పుడు తరచు రేఖలాబండ్ల పందెములు జరుగుచుండేవి. ఈబండి వేగముగాపోవుచున్నప్పుడు దానిపై పిల్లకాయ కూడా కూర్చుండియున్నట్లైతే-వాడతిభయముతో సీటును ఊలకరుచుకొని యుండేవాడు.

ఇవిగాక ఆరోజులలో మూడుచక్రముల వింతబండ్లుండేవి. వానిని మూడుచక్రముల త్రోపుడుబండ్లు అనేవారు. ఈబండ్లు ఆరోజులలో విస్తారముగ మధ్యతరగతివారివద్ద ఉండేవి. గుర్రపుబండ్లనుంచుకొగలిగిన పెద్దగృహస్థులుకూడ చిన్నసవారీలకు ఈబండ్లనుంచుకొనేవారు; మార్కెట్టుసవారీకి, రాత్రిసవారికి ఈ బండ్లనుపయోగించేవారు. ఈ బండి ముందుండు మూడవచిన్నచక్రమునకు పడవచుక్కానివంటిదొకటి అమర్చబడియుండును. బండిలోకూర్చున్న పెద్దమనిషి ఆ చుక్కాని చేబట్టి ఆ ముందుచక్రమును త్రిప్పుకొనుచుండును. బండిసాగుటకు వెనుకనుండి బోయీయొకడు బండినెట్టును. సవారీచేయు పెద్దమనిషి భారీఅయినవాడైన ఇద్దరు త్రోసేవాండ్రుందురు. ఆకాలమున మద్రాసులో ధనవంతులు పురుషులును చేతికి బంగారపు మురుగులు గొలుసులుకూడ పెట్టుకొనేవారు. ఈమురుగులు గొలుసులు నలుగురికి కనబడుటకై చొక్కాయిచేతులను పొట్టిగా కుట్టించుకొనేవారు. ఇవి ఎంతలావుగనుండిన అంత ధనవంతుడనిగొప్ప. ఆకాలమున చెన్నపట్నములో సమీపస్థమగు ఆరణి పొన్నేరి గ్రామముల చలవయన్న ప్రసిద్ధి ఆరోజులలో విస్తారము వాడుకలోనుండిన చాకులెట్ బొద్దంచుపంచలను ఈఆరణిచాకళ్లు అంచుముడత పడకుండ నేర్పుగా చలవచేసేవారు. మరియు నాకాలపు పురుషులును తెల్లరాళ్లఅంటుజోళ్లు, కమ్మలంతేసివి, పెట్టుకొనేవారు. ఆనాటి చెన్నపట్నపు తెలుగునాయుళ్లు, సెట్లు, ఆరణిచలవ చాకొలెట్‌బొద్దంచుపంచగట్టి మురుగులు గొలుసులు కన్పించునట్లు పొట్టిచొక్కాతొడిగి, తెల్లరాళ్లఅంటుజోళ్లు, పెట్టుకొని, ముఖమున గాత్రముగా తిరుమణి శ్రీచూర్ణములుధరించి ఆ మూడుచక్రాల త్రోపుడుబండిలో సవారిచేయుచున్న నాటిదృశ్యమును నే నెన్నటికైన మరువజాలను.

ఇట్లుండగా మొట్టమొదటవచ్చిన కొత్తరకపుబండి మద్రాసుకోచి (Madras Coach); దానితరువాత బ్రూహామ్ అనే పెట్టెబండి వచ్చినది. దానివెంట బొంబాయికోచి

(Bombay Coach), ఫీటన్ (Pheaton) లాండో, లాండోలెట్, డాక్కార్ట్ (Dogcart) అనే మరికొన్ని రెండుచక్రములు 4 చక్రములుగల గుఱ్ఱపుబండ్లు వరుసగా రాసాగినవి. ఆ పిదప ట్రాము, మోటారుకారు వచ్చినవి.

నేను మొట్టమొదట మద్రాసుకోచిని వాడుచుంటిని. ఆపిదప బొంబాయికోచిని వాడితిని. ఆతర్వాత క్రమముగా ఫీటన్, లాండోలెట్, లాండోబండ్లను వాడియుంటిని. ఆమధ్యకాలమందు వేలూరుజట్కాను ఉపయోగించితిని. కొన్నాళ్లు జోడుగుఱ్ఱముల బండిలో సవారిచేయుచుంటిని. మద్రాసునకు అప్పుడప్పుడు వచ్చుచుండిన ఆస్ట్రేలియన్ గుఱ్ఱములను, పెగుపోనీలను మంచిలక్షణములు గలవానినిగా కొని కొంతకాలము నావద్ద యుంచుకొని పిమ్మట మంచి ధరచూచి అమ్ముచుంటిని

## పాత వీధులు — పేటలు

### చీనాబజారు

పూర్వము చైనాదేశమునుండి వచ్చుచుండిన తెల్లకాకితములను చైనాకాకితములనుచుండిరి. ఆ కాకితములను విక్రయించు అంగళ్లవీధికి చైనాబజారు అనేపేరు ఇప్పటికిని వాడుకలోనున్నది. ఇటీవల దానినే నేతాజీ సుభాషచంద్రబోసుపేరట పిలుచుచున్నారని వింటిని. ఎస్ప్లనేడు ఈవీధిలో నొకభాగము.

### బందరు వీధి

బందరునుండి కొందరు అద్దకపు చీరలను తెప్పించి అమ్ముచుండిరి. ఈవ్యాపారము చేయువారుకూడా బందరు, నెల్లూరు, కరేడు, ఇనమన మెల్లూరు మొదలైన ఊళ్లనుండి వచ్చిన రంగిరీజులు, తెలుగువారు. అందుచేతనే దీనిని బందరువీధి అనిరి. ఆకాలమున పాలచంగావిధోవతులు, చీరలు నాజూకు గనుక స్త్రీలు పురుషులు వాటిని ధరించుచుండిరి.

### టంకశాల వీధి (Mint Street)

పూర్వము మద్రాసులో నాణ్యములను తయారుచేయుచుండిరి; గనుక ఆపని జరుగుచుండిన ఈ వీధిని టంకశాలవీధి అని పిలువసాగిరి. 1692 లో మొగలాయి పాదుషా ఆంగ్లేయులకు పాదుషాబొమ్మతో స్వయముగా నాణ్యములను అచ్చుపోసుకొనే హక్కు నిచ్చెను. నాటినుండియు నిచ్చట చిరకాలము ఆపనిజరిగియుండెను. ఆపని ప్రస్తుతము నిలిచిపోయినను ఆ వీధి కాపేరుమాత్రము పోలేదు. ఈ వీధి చాలాపొడవు.

### ఓడకాలువీధి

పూర్వము మద్రాసులో దేశవాళీఓడవర్తకము జరుగుచుండెను. ఈ ఓడవర్త

కమున పూర్వము సుప్రసిద్ధులు—సూరంవారు, అవధానంవారు, గుఱ్ఱంవారు మొదలైన నెల్లూరిజిల్లా బ్రాహ్మణులు; తుమ్మగుంట ద్రావిడులు. వీరు ముత్యాలవర్తకమున, పగడాల వర్తకమున చాల పేరుపొందినవారు. ఈ ఓడవర్తకమున ముఖ్యముగా క్రొత్తపట్నం, ఓడరేవు, బందరు, శ్రీకాకుళం, కాకినాడ మొదలగు రేవులనుండి మద్రాసుకు సరుకు దిగుమతి అగుచుండెను; మద్రాసునుండికూడ సరుకు ఆయా రేవులకు ఎగుమతి జరుగుచుండెను. ఆకాలమున మద్రాసు సముద్రతీరమునకు సమీపమున నొక వీధిలో ఓడ స్తంభములు (ఓడకాళ్లు)వగైరా ఓడసామానులు తెచ్చి ఉంచుచుండిరి. అప్పుడావీధికి ఓడకాలువీధి అని పేరువచ్చినది. ఈ ఓడవ్యాపారము క్రమముగా నిలిచిపోయినది. అంత నావీధిలో హీనజాతి వ్యభిచారస్త్రీలు కాపురముండసాగిరి. క్రమముగ నావర్తకమునకా వీధి పేరువడసినది. సమీపముననున్న కోటలోనుండి తెల్లసైనికులు ఆవీధిలోకి షికారు వెళ్లుచుండిరట. ఈ వ్యభిచారస్త్రీలు సిగ్గువిడిచి గుమ్మములో నిల్చుండి దారినబోవు వీరిని పిలువసాగిరట. అంతట వారు (Why do you call me ?) 'నన్నేలపిలిచెదవు?'అని అడుగసాగిరట. ఆవిధముగానది Why do you call (me) street అన్నది అపభ్రంశమై "ఓడక్కాల్ వీధి" అని మారి - ఆ పేరు స్థిరపడినది— అని పెద్దలు కొందరు చెప్పుదురు. మొత్తమునకు ఆ వీధికాపేరు వచ్చుటకు మూలముమాత్రం ఓడసామానులు వీధులలో పడియుండుటే అనవలయును. కాలక్రమమున నావీధి వ్యభిచారస్త్రీలకు నిలయమగుటచే పెద్దమనుష్యులావీధికి పోవుటకు జంకుచుండిరి.

ఏడు బావుల వీధి (Seven wells street)

పూర్వము మద్రాసులో కొళాయినీరు లేనప్పుడు నగరమునకు నీటిసప్లైకి మూలమైన ఏడుబావులను వేరుగ ప్రస్తావించియున్నాను. ఆ ఏడుబావులున్న వీధియగుటచేత నీవీధికి ఏడుబావులవీధియన్న పేరువచ్చినది.

ఐస్ హౌస్ రోడ్డు(Ice house road)

ఈ పేరుగలవీధి మొదట వితంతు శరణాలయం (Widows home) అను గుండ్రటి కట్టడము ఐస్‌హౌస్ అను పేరుతో నున్నది. దీనిప్రక్కనే వెల్లింగ్డన్ బాలికాపాఠశాల Wellingdon Girls Training School) గలదు. పూర్వము మద్రాసులో మంచుగడ్డ యుత్పత్తిచేయుట లేదు. అప్పుడు దొరలు ఉపయోగార్థము విదేశములనుండి మంచుగడ్డలను ఓడలలో తెప్పించి ఈ కట్టడములో నిలువయుంచేవారు. అప్పుడందుచే ఈ కట్టడమునకు ఐస్‌హౌస్(Ice House) అనే పేరుగలిగినది. మంచుగడ్డను నిలువచేయుటకు ఈ కట్టడములో గచ్చుతో గుంటను కట్టియుండిరి. ఇచ్చటనే మంచుగడ్డతయారుచేయుట కవకాశ

మీర్పడగానే దాని అవసరము తప్పిపోయినది. అంతనది అమ్మకమునకురాగా మొట్టమొదట బిళిగిరి అయ్యంగారు అను అడ్వొకేటు కొనెను. ఆతరువాత గవర్నమెంటువారు దానిని కొని బాగుచేయించి అందు వితంతుశరణాలయము నుంచిరి. ఎన్నిచేతులు మారినను ఆ బిల్డింగునకు ఆపేరు మారలేదు; ఆరోడ్డునకు నాపేరే ఏర్పడినది.

పాతచాకలపేట

పాతచెన్నపట్నమున పాతచాకలపేట చాలముఖ్యమైనస్థలము. ఇది తిరువత్తియూరుహైరోడ్డును ఆనుకొనియున్నది. ప్రథమములో ఇక్కడ ఈస్టిండియాకంపెనీవారు ఈచుట్టుప్రక్కల వస్త్రములను నేయించి, చలవచేయించి, రంగులద్దించి విదేశములకు ఎగుమతిచేయువారుగదా. ఆయావృత్తులవారంతయు ఇక్కడ తరతరములుగా కాపురముంటున్నారు. అందు ముఖ్యముగా తానులు చలవచేయువారు విస్తారమగుటచే దీనికి చాకలిపేట అని పేరువచ్చెను. అయితే ఆ వర్తకమునననుసరించి ఇతరజాతులవారున్నూ ఇచ్చటచేరిరి. క్రమముగా నిది పట్నమందలి సంపన్నగృహస్థుల నిలయమైపోయినది. నాడుదీనిని అందచందములుగల ప్రదేశము (Fashionable quarters) అనేవారు, ఇచ్చటనే శ్రీ పిట్టి త్యాగరాయశెట్టిగారు నివసించుచుండిరి. వారు నేతవృత్తిగల దేవాంగకులములో పెద్దలు; పిదప బ్రాహ్మణేతరోద్యమమునకు నాయకులు. మద్రాసు కార్పొరేషనుకు మొట్టమొదటిసారిగా అధ్యక్షులుగా ఎన్నుకోబడినవారు. వారిని "మద్రాసునకు మకుటములేని రాజు" (The uncrowned king of Madras) అనేవారు. గవర్నరులను కూడా లక్ష్యపెట్టేవారుకారు. కొల్లా వెంకటకన్నయ్య శ్రేష్ఠిగారుకూడా ఇక్కడనే నివసించేవారు. వీరినిగూర్చి ఇదివరలోనే చెప్పియున్నాను. వీరు వైశ్యకులమునకు పెద్దశెట్లు. వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారున్నూ సుమారు 100 సం॥ల క్రితము ఇచ్చటనే తమ ఆదిసరస్వతీ ముద్రాక్షరశాలను, గ్రంథనిలయమును నెలకొల్పి నడిపిరి; దానిని వారి కుమారులు శ్రీ వేంకటేశ్వర్లుగారు విడువక వృద్ధిచేసి నడుపుచున్నారు. లాయరు కృష్ణస్వామి శెట్టిగారున్నూ ఇచ్చట కాపురముండినవారే. ముట్నూరి ఆదినారాయణయ్యగారును ఈప్రాంతముననుండినవారే. వారు రివిన్యూశాఖలో గొప్పగొప్ప ఉద్యోగములను నిర్వహించిరి. చల్లపల్లి జమీందారుల బంధువులును ఈప్రాంతములోనే గొప్పబంగళాలలో నివసించుచున్నారు. పురాతనకాలమున తంజావూరు రామానాయుడు, వారికుమారుఖు రంగయ్యనాయుడుగార్లున్నూ ఇచ్చటనేయుండిరి. కొల్లావారున్నూ రామానాయుడుగారున్న ఇచ్చట తమతమపేరట అగ్రహారములు నెలకొల్పిరి. కొల్లావారి అగ్రహారమునందే ముట్నూరి ఆదినారాయణయ్యగారు నివసించుచుండినది. ఇచ్చటనే ఆంధ్రవైష్ణవ కుండిలోత్తములునుండిరి. ఆరోజులలో ఇచ్చట విద్వద్గోష్ఠులు హెచ్చుగ జరుగుచుండెడివి. ఇంతవరకు ఆంధ్రులనే చెప్పితిని. నాడు ఆంధ్రులే ప్రబలులైయుండుటచే వారితోపాటు

ఆంధ్రేతరులలో గొప్పవారును ఇచ్చట నివసించుచుండిరి. సర్ ఉస్మాన్‌గారు గొప్ప యూనానీవైద్య కుటుంబమునకు చెందినవారు. వారికుటుంబమును ఇచ్చటనే నివసించు చుండెను. సర్ సి. పి రామస్వామిఅయ్యర్ తండ్రి పట్టాభిరామయ్యర్ గారును సుప్రసిద్ధులు సి. వి. రంగనాథశాస్త్రి వారికుమారులు కుమారస్వామిశాస్త్రిగార్లును ఇచ్చటనే నివసించు చుండిరి. దాక్షిణాత్యవైష్ణవులు మద్రాసునకు పెద్ద ఉద్యోగస్థులుగాను, వకీళ్లుగానువచ్చి మైలాపూరున నివాసమేర్పరచుకొనినపిదప, ట్రాము, బస్సు సౌకర్యములిటు హెచ్చినపిదప చెన్నగరసౌభాగ్యలక్ష్మి ఉత్తరమునుండి దక్షిణమునకు మ్రొగ్గినది.

వైకుంఠవాత్యారివీధి

ఈవీధి జార్జిటౌనులోయున్నది. ఇందు ముందునివసించుండిన వారందరు వైష్ణవులు. వీరలలో ముఖ్యముగ వంటచేయువారు, అయ్యంగార్లు అమ్మంగార్లు నుండిరి. పెండ్లిపేరం టములనుచేయించు వైష్ణవపురోహితులునుండిరి. ఈపూరిలో కర్మాంతరములలో బ్రాహ్మ ణులకు శయ్యాదానమునుచేయు ఆచారముకలదు. ఈ శయ్యాదానమునకై సాధారణ ముగ చనిపోయినవాడు పండుకొనుచుండిన మంచమునే ఇచ్చుట వాడుక. ఈశయ్యా దానముపట్టు పౌరోహితుడును వానిభార్యయు శయ్యపై అనగా నామంచముపై కూర్చుండి పాదపూజనుచేయించుకొని దానమును తీసుకోవలయును. ఏ ఊరినుండో పొట్ట ఆత్రమునకైవచ్చిన పేదపౌరోహితుడు భార్యనుకూడా చంకబెట్టుకొచ్చినాడా? భార్య పొజకలోలేనివాడేమిచేయును ? అట్టివారికి దానసమయమున సహధర్మచారిణియగుటకు బాడుగతీసుకొనివచ్చు భార్యలు ఈవీధిలో సులభముగాదొరుకుచుండిరి ఆమెయేజాతియో తెలియకున్నను, అవసరముకొలది స్మార్తవేషమునుగాని వైష్ణవవేషముగాని ధరించి ఎబ్బెరి కము లేకుండా పౌరోహితుని ప్రక్కనకూర్చుండి, ఏనాటిసుకృతమువల్లనో, క్రతువులుచేయు యజమానిచే పాదపూజచేయించుకొని శయ్యాదానమును ఆ తత్కాల భర్తతోపాటు స్వీకరించెడిది. ఈ ఊరిలో మరియొక చిత్రముగలదు. మరణించినవారికి బంధుబలగము లేనప్పుడు కూలిదీసికొని ఏడ్చిపోవువారున్నూ ఉండిరి !

(సశేషము)

---

గృహలక్ష్మికి బుద్ధుని బోధ

భార్యగా :

నీ విధులను పూర్తిగా నెరవేర్పుము.
సంసారంలో అందరినీ చక్కగా ఆదరించుము.
వ్యభిచరించకుము.
నీభర్త సంపాద్యాన్ని సంరక్షించుము.
గృహకృత్యాలను శ్రద్ధతో, నేర్పుతో నెరవేర్చు.

మాతగా :

నీపుత్రుని దుర్మార్గముపంక వెళ్లనియ్యవద్దు.
వానిని సన్మార్గంలో ఉంచుము.
వానికి ఏదైనా శాస్త్రం (బ్రతుకుతెరువు) నేర్పించు.
అతనికి తగిన కన్యనుతెచ్చి పెండ్లిచేయుము.
తగినసమయాన మీఆస్తి నతనికప్పచెప్పండి.




## ఉష్ణముతగ్గుటకు

తూర్పుదిక్కుపోయిన వేపవేరు తెచ్చి, చితుకకొట్టి ఒకఔన్సు మజ్జిగలో నానవేయవలయును. 5 మిరియాలుకూడా ఆ మజ్జిగలో నానవేసి 24-గంటలు నాననిచ్చి ప్రొద్దున పరగడుపున పైచెప్పిన మిరియాలుతిని మజ్జిగతాగవలయును. చెక్క నాలుగురోజులు నాననిచ్చి వేరేమార్చవలెను. ఈప్రకారం (40)రోజులు ఇచ్చిన ఉష్ణముతగ్గును.

కాకాణి మీనాక్షిసుందరమ్మ.

### శిశువ్యాధులు - చికిత్సలు.

8 చెవినొప్పి:- పసిపిల్లలు కారణములేక యేడ్చునప్పుడు తల్లులు గమనించవలయును. వారు చేతులతో చెవులను పులుముకొనుచుందురు. అట్టివేళల తల్లుల చనుపాలను చెవిరంధ్రములలో చిమ్మునట్లుచేయుట ప్రథమచికిత్స.

చలిగాలిగాని, వేడిగాలిగాని సోకినప్పుడు చెవుల సూక్ష్మావయములు వేడెక్కనను పోటుకలుగును. చలివల్లకూడ సూక్ష్మావయవములు వాతముచే సామాన్యముగా నుండుటకంటె విస్తరించుటసహజము. కొంచెము ఇంగువపలుకులను నూనెలోవేసి కాచి చల్లార్చి రెండుమూడు బొట్లు చెవిలో వేసిన తగ్గును.

మరియొక చికిత్స: తులసి ఆకులను నీళ్లలోవేసి కాచి వడబోసి రెండుమూడు చుక్కలువేసి మంచిదూదిని కొంచముగా పెట్టవలయును గాని అదిమిపెట్టరాదు. మరికొందరు జాజికాయపొడిని నీటిలోగాని, ఆముదములోగాని వేసి వెచ్చచేసి చల్లార్చి వేసెదరు. అదికూడమంచిదే.

కొన్నివేళల చీముకారుటయుకూడ సంభవించును. కొంచెము బోరిక్ పౌడరుగాని జింకుపౌడరుగాని చెవిలోనికి వూదుట మంచిది. ఘాటుగల ద్రావకములుగాని పిచికారి చేయించుటగాని మంచిదికాదని నవీన శాస్త్రజ్ఞులు చెప్పియున్నారు.

9 కండ్లకలకలు :- పటికను పేలగింజచేయుట యన పొంగించుట అట్టిదానిని మెత్తగ పొడిచేసి మంచినీళ్లలోవేసి వుంచుకొనవలయును. బాగానీళ్లలోకలిసినదని తెలుసుకొనిన పిమ్మట వడబోయవలయును. నలుసులుగాని అపరిశుభ్రతగాని యే మాత్రము వుండకూడదు. 1 తులము పటికచూర్ణమును 1 పౌను నీళ్లలో చేర్చవలయును. ఫిల్లరుతో రెండుమూడు చుక్కలు కంటికొలుకులలో వేసినచాలును. పూర్వీకులు "కనుకుడి" విత్తులను వాడెదరు. నల్లగానుండును. మిసమిసలాడుచుండును. నేర్పుకొలది వగులకొట్టిన లోపలిపప్పు పచ్చగనుండును. దానిని మెత్తగ రాగిపళ్లెముపైన రాగిపాత్రతోనే మెత్తగ నూరవలయును. పొడిఅయిన పిదప చేతితో కాటుక పెట్టినట్లు రెప్పలకంటించిన కండ్లకొలుకుల లోనికిపోయి నీరుకారినపిదప హాయిగానుండును. ఆవువెన్నకల్పి కాటుకగా తయారుచేయుదురు. అట్టి కాటుకనుగూడ రాగి డబ్బాలోనే వుంచుట శ్రేష్టము. రాగి కండ్లకు మేలు చేయును. ఆవు వెన్న మంచిచూపునిచ్చును. రెప్పలకు బలమొసంగి కండ్లువిప్పారును.

10 జలుబు :- సామాన్యముగా పిల్లలకు తరుచువచ్చుచుండును. ఇందులకు కారణములు పెక్కులుకలవు. తల్లిగమనించుటయే కర్తవ్యము. స్నానము చేయించిన పిమ్మట సాంబ్రాణి పొగవేయుదురు. అదియే చాలు ననుకొనకూడదు. జీర్ణకోశ పరిస్థితినికూడ గమనించి విరేచనసాధన స్వల్పముగ చేసిన మంచిది. తల్లి ఆహారము, పాలు, పరుండబెట్టునట్టి చోటు, ఉడుపులమార్పు తగునట్లు ఉపచర్యలు చాలును. మంచిగాలి వెలుతురు, నిశ్శబ్దముగల ప్రదేశము, ధూప సదుపాయములు కాపాడును. నిర్లక్ష్యము చేసిన పెక్కులక్షణములకు తావొసంగి జ్వరసింపజేయును.



గతసంచికయందు నెల్లూరిలో పల్లికొండ శ్రీ రంగనాధస్వామివారికి వైష్ణవస్వాములు నిత్యము ఆరగింపుచేసే పులిహోరతళియలో కలియు వివిధపధార్ధపరిమాణముల వివరించియుంటిమి. మాసోదరి శ్రీమతి కుంచం వెంకటరత్నమ్మగారు విజయనగరమునుండి ఆక్షేపించుచు తమకెరుకగల తళియపాళ్లను వివరించినారు. అందు అన్నివస్తువులు నెల్లూరి శ్రీరంగనాధస్వామివారి తళియప్రకారమే యున్నవిగాని - రెండు వస్తువులు మాత్రము హెచ్చుగా చెప్పినారు. (1) పసుపుగుండ(పొడి)తగినంత, (2) నువ్వుపప్పు ¼ శేరు, (3) నిమ్మకాయలు. పసుపుగుండ(పొడి)నెల్లూరిమిత్రులు తెలిపిన తళియలో చేరకుండుట పొరబాటె, అనగా అచారముకాబట్టి. ఏమో నెల్లూరి శ్రీరంగనాధుడు పసుపువేయని పులిహోరనే మెచ్చునేమో; తెలియదగును. కాని మాఉద్దేశము చేర్చవలయుననియే. బహుశా మామిత్రులు వ్రాయుటలో నదిజారవిడిచిరేమో! అందుకే మేము ఇది స్త్రీలపత్రిక; స్త్రీలవిషయములు; స్త్రీలప్రసంగము; స్త్రీలప్రసక్తి. పురుషులు కొంచము వెనుకతగ్గండి బాబూ అని కోరుచుందుము. స్త్రీ పసుపుమరచిపోగలదా? ఇక నువ్వుపప్పువిషయము. నెల్లూరి ప్రాంతములో నువ్వుపప్పు లభ్యముకాదు. అలవాటులేదు. ఆపప్పు ఉత్తరసర్కారులలోమాత్రమే దొరుకును. వారు తెల్లని నువ్వుపప్పు నుపయోగించినమాత్రాన నాగరికులు, నల్లనువ్వులు అపశకునముగానే ఉపయోగించు నెల్లూరిప్రాంతమువారు మోటువారుకాదు. పొట్టు తొలగుటచేత నువ్వులనూనెకు సహజముగానుండవలసిన కొన్ని గుణగతములు లోపించును. మరియు, నైజమైన రుచియు, వాసనయు భేదించును. అట్లని వీరు ఉత్తరసర్కారులవారి పప్పునూనెను ఆక్షేపింతురు. కావున నెల్లూరి శ్రీరంగనాధస్వామి తనభక్తులకు చేతికందుబాటులోలేని నువ్వుపప్పు కావలయునని కారుబారుచేయడు. అవటశ్రీ సింహాద్రి వరాహ అప్పలనారసింహుడనై సాపడుచున్నాను చాలదా - అనుకొనును కాబోలు! అయితే శ్రీమతి కుంచం వెంకటరత్నమ్మగారు దయతో నీ విషయమై వ్రాసినందులకు వారి నభినందించుచున్నాము. ఆ యా ప్రాంతములవారు తమతమ ప్రదేశముల ఆచారముగచేయు పాకవిధానముల నిట్లు తెలిపినగాని పరస్పరమెరుక పడి, ఆ యావిధానములందు హేతువులు బోధపడవు. పులిహోరను వీరవైష్ణవులు, గొలకొండ వ్యాపారులు, నియోగివైష్ణవులు, మాధ్వులు, బ్రాహ్మణేతరవైష్ణవులు, స్మార్తులు - ఇందరును చేసికొందురు. వీరందరికి పాకబేధముకలదు వైష్ణవులు చేసిన పులిహోర నాలుగైదు రోజులైనను చెడకపోవుటేగాక రుచి హెచ్చునట. స్మార్తుల ఇండ్లలో చేయునది ఆ మరునాటికే మెతకపడును.

## చక్కెరపొంగలి

శ్రీ రంగనాధస్వామివారి కారగింపగు చక్కెరపొంగలి తళియపాళ్లు.

| | | | |
|---|---|---|---|
| తళియ 1 కి బియ్యము | 3 శేర్లు | కలకండ(చీనాఅయితేమంచిది) | 5 పలములు |
| చాయపెసలపప్పు | 1 శేరు | జాజికాయలు | 2 |
| మంచిబెల్లం | 4 వీశలు | జాపత్రి | ½ పలం |
| నెయ్యి | 1 వీశ | సీమబాదంకాయలు (పప్పు ఎంత అయితే అంత) | 10 పలములు |
| ముంతమామిడిపప్పు (పొట్టువలిచినది) | 2 పలములు | కుంకుమపువ్వు | 1 తులము |
| యాలకులు | 1 పలము | పచ్చకర్పూరం | రు 0-8-0 (రమారమి చూచుకొనేది). |
| ద్రాక్ష | 10 పలములు | | |

(కంచి, శ్రీరంగములలో చక్కెరపొంగలి బాగుండునందురు.)
ఈపదార్థములతో మామూలుగాచేయు పద్ధతినే చేయవలయును.

## పప్పుపొంగలి. (వెన్‌పొంగల్)

| | | | |
|---|---|---|---|
| తలియ 1 కి | | అల్లము | 4 పలములు |
| బియ్యము | 3 శేర్లు | ఇంగువ | ¼ పలము |
| చాయపెసలపప్పు | 1 శేరు | మిరియములు | 1 పలము |
| నెయ్యి | ½ వీశ | జీలకర్ర | 1 పలము |
| ముంతమామిడిపప్పు | ¼ వీశ | ఉప్పు | ¼ శేరు |

ఇదియు మామూలుగా పొంగలి వండినట్లే వండునది.

## దధ్యోదనము. (పెరుగన్నము)

| | | | |
|---|---|---|---|
| తలియ 1 కి | | శొంఠి | 2 పలములు |
| బియ్యము | 3½ శేర్లు | ఇంగువ | ½ పలము |
| మిరపకాయలు | 2 పలములు | ఉప్పు | ¼ శేరు |
| ఆవాలు | 4 పలములు | నెయ్యి | 2 పలములు |
| పచ్చిమిరపకాయలు | 4 పలములు | పెరుగు | 6 శేర్లు |
| అల్లము | 4 పలములు | మినపప్పు | 1/8 శేరు |

## వడ

ఒక శేరు మినపపప్పునకు—మిగత రసవర్గముల పాళ్లు

| | | | |
|---|---|---|---|
| మినపపప్పు | 1 శేరు | మిరియాలు | ½ పలము |
| నెయ్యి | 10 పలములు | జీలకర్ర | ½ పలము |
| ఇంగువ | 1 తులము | ఉప్పు | ⅛ శేరు |

## దోశె

| | | | |
|---|---|---|---|
| ఒకముంతకు (3½) శేర్లు | | జీలకర్ర | 1 పలము |
| బియ్యము | 2½ శేరు } 3½ శేర్లు | మంచినూనె | 5 పలములు |
| మినపపప్పు | 1 శేరు | శొంఠి | 2 పలములు |
| మిరియాలు | 1 పలము | ఉప్పు | ¼ శేరు |

## అప్పం (అప్పాలు)

| | | | |
|---|---|---|---|
| ఒక శేరు పిండికి పాళ్లు | | నెయ్యి | 10 పలములు |
| పిండి | 1 శేరు | యాలకులు | ½ పలము |
| బెల్లం | 10 పలములు | నూనె | 1 పలము |

ఇవన్నీగాక పోళీలు (పోళిగలు) లడ్డు, సోమాసి మొదలైనవికూడా చేయుదురు. వీటిలో పాళ్లు పిండివంటలు చేయువారికందరికి తెలిసినవే. అవే దేవాలయములయందును అవలంబింపబడినవి.

వీటన్నిటికితోడు బకాళాబాత్, అక్కారవడిశల్, సుండల్, జీరా, కదంబము మున్నగునవి చేయుదురు. వానిపాళ్లు వచ్చేనెల సంచికలో తెలుపుదుము.

———:♦:———

★

# ఇంటిపనులలో మెళకువలు

గత సంచికలో - ఆడపిల్లలకు మగపిల్లకాయలకు ఉభయులకూ పనికివచ్చే - సంగతులే చెప్పివాను. ఈసారి ప్రత్యేకంగా ఆడపిల్లల విద్యయెడల చూపదగిన శ్రద్ధనుగూర్చియే వ్రాస్తాను

* * *

ఆడపిల్లలకు మగపిల్లకాయలకు నేడు బడులలోచెప్పే విద్యలో విశేషం భేదము లేదు. ప్రత్యేకంగా ఆడపిల్లలకుతగిన విద్యావిధానం సక్రమమైనది ఇంకా ఏర్పడలేదు. కాబట్టి బడిలో నేర్పువిద్యను, ఆడపిల్లకు, పిదపజీవితంలో కావలసినదానిని, బడిలో నేర్పే విద్యకు తోడుగా నీవు ఇంటిలో నేర్పవలెను. బడిలో శాస్త్రవిద్యలునేర్చివచ్చిన బిడ్డకు ఇంటిలో వానిని వినియోగించి ఇల్లుదిద్దుకొనే మెళుకువలు నేర్పడానికి నీవే గురువు.

* * *

నీకుమార్తెకు ఆమెశక్తి ననుసరించి - బట్టలను శుభ్రంగా, సులభంగా, ఉతికి ఆరవేయడం మడతపెట్టడం నేర్పవలెను. గుడ్డలకు సబ్బుపట్టించడంలోను నేర్పు అవసరం. వివిధమైన ఉడుపులకు వేర్వేరువిధంగా సబ్బుపట్టించవలెను. చొక్కాలు, రవికలు, ముస్నగు వంటికి తొడుక్కొనేవానికి ముఖ్యంగా చంకలవద్ద, మెడపట్టీలకు, బాగా సబ్బు పట్టించాలి. కట్టుకొనే పంచలు, చీరలు, పావడాలు ఐతే - నడుముతగిలే అంచులకు క్రింద జీరాడే కుచ్చెళ్లఅంచులకు బాగా సబ్బుపట్టించవలెను. అట్లాగే ఆయాయుడుపులు బాగా దేహాన్నంటి చెమటన మాగేస్థళాలలో సబ్బుపట్టించవలెను.

* * *

సబ్బు పట్టించినగుడ్డలు శ్రమలేకుండా బండనవేసి బాదితే మురికిపోతుందని కొందరి కొరక అపోహ - అందువల్ల బట్ట జంకి చినుగుతుందేగాని మురికివదలదు. తగినంత కాలం సబ్బునీళ్లతో మురికిప్రదేశాన బట్టనానితే మురికిదానంతట అది పీడిపోతుంది. అప్పుడు గట్టిస్థళంలో బట్టను ఉసిమితేచాలు. మురికి వదలిపోతుంది.

* * *

చేయెత్తి బట్టలుతకడంవల్ల శ్రమయేగాని ఫలితంతక్కువ. ఉసిమితే - పిల్లలకు ఊపిరితిత్తులకు రొమ్ముకండరములకు బలము. దండలకుబలము. పొట్టలోఉండే హెచ్చు క్రొవ్వు కరిగి నడుము సన్నగిల్లును. అయితే బిడ్డ ఆయుకితగిన పనిపెట్టడంలో ఉన్నది తల్లినేర్పు. బిడ్డ మున్ముందుగా తన చిన్నచొక్కాలు, కుచ్చిగుడ్డలు ఉతుక్కోడం అలవాటుచేయండి.

* * *

బిడ్డలనుసాకడం బడిలో పూర్తుగా చెప్పరు; చెప్పజాలరు. సామాన్యంగా మధ్యతరగతియిండ్లలో పెద్దబిడ్డలు చిన్నబిడ్డలను ఎత్తుకోవడం, సముదాయించడం, ఆడించడం, అన్నంపెట్టడం, నీళ్లుపోయడం, నిద్రపుచ్చడం - చేస్తునే ఉంటారు. అయితే తల్లులు బాగాగమనించకుండా వాళ్లమీద వదలిపెట్టుతారు. వాళ్లు చిన్నతనంచేత తమకు తోచినవిధంగా ఆయా ఉపచారాలుచేస్తారు. తల్లులు గమనించినప్పుడు సరిగా ఆబిడ్డలు చేయకపోతే, పళ్లు పటపటకొరికి తిట్టడమో, లేక వీపుపేటురేగేట్లు చరచడమో తప్ప నయతరంగా బిడ్డలకు సరియైనపద్ధతి సామాన్యంగా బోధచేయరు.

* * *

బిడ్డలహృదయం కోమలం. వారికి ప్రేమానురాగాలు సహజం. చిన్నతనంలో ముందు తాటాకుబొమ్మలమీద, కొయ్యబొమ్మలమీద ప్రారంభమై, పిదప తన తమ్ముల మీదికి చెల్లెళ్లమీదికి ఆప్రేమ మారుతుంది. అల్లాంటప్పుడు సరియైనశిక్షణకూడా ఉంటే - వారి పోషణక్రమము నేర్చుకొని, పిదప తమబిడ్డల నెత్తేరోజుకు మాతృత్వంలో డిగ్రీ పొందిన వారవుతారు.

* * *

మరొక్కజాగ్రత్తకూడా నీవు వహించాలి. చదువుకు సోమరులైన ఆడపిల్లలు బడికి పోవలసిన వేళకు అమ్మకాప్యాయంగా పిదప బిడ్డలనెత్తుకోని తలాయిస్తారు. అది సహించకూడదు. ఆమోదించకూడదు. అయితే ఆబిడ్డ చదువులో ఏది కఠినంగాతలచి తలాయిస్తున్నదో మెళకువతో గ్రహించి ఆ భయం పోగొట్టాలి. అదీ నీపనే.



# బ్రతుకు తెరువు



గత సంచికయందు తేనె పట్టులను పెట్టు విషయమై వ్రాసియుంటిమి. ఈ సాంశము గ్రామ పరిశ్రమలలో ముఖ్యమైనదిగా స్వామి ఆనంద గారు 23-2-47 "హరిజన" పత్రిక యందిట్లు వ్రాసియున్నారు:—

తోటలు గలవారికి, అడవుల అంచున నివసించే వ్యవసాయదారులకు ఇది చాలా ఉపయోగకరమైన పరిశ్రమ. దీనివల్ల చక్కని ఆహారపదార్థము లభ్యమగుచున్నది, మంచి ఆదాయము కలుగును. ఆటవికులు తేనె సంతరించుదురు; ముఖ్యముగా పట్నములలో అమ్మకటకే వారు దానిని సేకరింతురు. అయితే వారు దానిలో ఇతర పదార్థములుకల్పి మోసము చేయుచుందురు. అంతేకాక వారు తేనె సేకరించే పద్ధతి చాలా పురాతనమైనది, మోటైనది. ఆ పద్ధతిలో - తేనెటీగలన్నియు చచ్చిపోవుచున్నవి. తేనె పట్టులు పెట్టించే ఆధునిక పద్ధతియే ప్రోత్సహింపతగినది; గ్రామస్థుడికి లాభకరమైనది. ఇటీవల కొన్ని సంవత్సరముల క్రిందట ఉత్తర కన్నడజిల్లాయందు తేనె పట్టులు పెట్టించేవారి సహకార పరపతి సంఘము లేర్పడి, పెంపొందుచున్నవి......

## ఆహార-పదార్థముల పం ట

ప్రతి గృహలక్ష్మియు శ్రద్ధవహించినట్లైతే ఆహార పదార్థములను సాలుపాడవున పండించి దేశ మండలి ఆహార సమస్యను పరిష్కరించుటకు తోడ్పడ వచ్చును. మేమేమి, పొలములకుపోయి, వ్యవసాయము చేయిస్తామా? తోటలు దొడ్లువేసి పెంచుతామా? ఏతాలెత్తి, మోటతోలి నీరు పారిస్తామా? అని మీ రడుగ వచ్చును. ఈ విషయమై గాంధీ మహాత్ముని పాశ్చాత్య శిష్యురాలు — మీరాబెన్ అనే హైందవ నామధారి, (అసలు స్లేడ్ కన్య) హరిజన్ పత్రికలో (2-11-47 నుండి) కొన్ని వ్యాసములను వరుసగా వ్రాసియున్నది. అందులో ఆమె ఇట్లు చెప్పినది:—

"ఒక్క అంగుళము భూమిన్ని లేనివారుకూడ పగిలిపోయిన కుండలు, గాబులు, పాతప్యాకేజి పెట్టెలు చేర్చి, వాటిలో ఇంత మన్నేసి ఆకు కూరలు, కాయగూరలు పెంచవచ్చును." ఇది ప్రతిగృహలక్ష్మికిని అందుబాటులోనిదే గదా. ఇందుకు కావలసినదంతా "ఆచరణలో పెట్టదగిన శ్రద్ధయే" అని ఆమె దృఢ నమ్మకము.

దొడ్డిలోగాని ఇంటిముందుగాని ఏమాత్రము స్థలమున్నా చక్కగా ఒకటి రెండు సార్లు త్రవ్వుము. త్రవ్వడానికి గునపాలు, శలగపారలు అక్కరలేదు. గరిటెకాడగాని, అట్లకాడగాని చాలు. నేల గట్టిగ ఉంటే ఒక రోజెల్లా ఆరార నీరు జల్లితే సరి; అదే మర్నాటికి మెత్తబడుతుంది. ఆ త్రవ్విననేల నట్లే విడిచిపెట్టు; బెడ్డలు నలగగొట్టి చదును చేయకు. అట్లాగే విడవడంచేత సళ్లుబారిన నేలలోనికి సూర్యరశ్మి, గాలి దూరుతుంది. ఆ విధంగానే ఒక వారం ఉండనీ. గాలి సూర్యరశ్మి ఆ నేలకు మంచి సత్తువ నిస్తాయి. సావకాశముంటే 3, 4 వారాలట్లే వదిలినా మంచిదే. ఈ లోపల ఎరువుగా పనికి వచ్చే చెత్తాచెదారము పోగుచేసిఉంచు. దానిని మట్టితో కలిసిపొయ్యేటట్లు పదునుచేయుము. అప్పుడు బెడ్డలు నలగగొట్టి ఎరువు సమంగా నేలపైచల్లి - గుచ్చెత్తి చదునుచేయుము. అప్పుడా మెత్తటిమన్నుమీద బాగా నీరుపోసి మట్టి చేతికంటుకోకుండా తడిమాత్రం ఆరిపోకుండా ఉండేపదును వచ్చేదాకా నిదానించు. ఇట్లాంటి పదునుచేసిననేల 6 అ॥ల పొడవు 5 అ॥ల వెడల్పు అయితే చాలు - మట్టసమైన కయ్య అవుతుంది. అవసరాన్నిబట్టి కయ్య ఇంకా చిన్నదైనా కొంచం పెద్దదైనా ఫరవాలేదు. అయితే, చుట్టూ 5 అం॥ల వెడల్పున 4 అం॥ల ఎత్తున గట్టు మాత్రం వేయాలి. స్థలముంటే ఇట్లాంటి కయ్యలు రెండుమూడు చేయుము. మీ ఇంట్లో కొళాయిగాని, పంపుగాని, బావిగాని ఉంటే-అక్కడినుంచి నీరురాను చిన్న కాలువ దీసి ఆ కయ్య ప్రక్కనే పోనీ. ఆ కాలువ కయ్యలకన్న కొంచం ఎత్తున ఉండాలి. ఏమంటే, కాలువలో ఎక్కడ దారిచేసినా కయ్యలోకి నీరు పారేట్లుండాలి.

—o—



# సహగమనము



శ్రీ యం. రామజోగారావు గారు

కృష్ణపురమును హిందూదేశపు వెనీసునగరముగ తలంపవచ్చును. గ్రామము చిన్నదైనను, కృష్ణాస్రవంతీమధ్య నుండుటంజేసి కడుంగడు రమ్యముగ నుండును. చుట్టుప్రక్కల నుండెడి యే గ్రామమునకు పోవుదమన్నను కృష్ణను తెప్పలపై దాటి పోవలెను. వెనీసు నగరమునలేని సౌందర్యములలో నొకటి కృష్ణపురమున నెక్కుడుగ నున్నది. కృష్ణావగ యీప్రాంతములందు పర్వతప్రదేశములనంటి పోవుచుండును. రెండు మూడు మైళ్లు లోపున నేవైపుజూచినను పర్వత దృశ్యము మనోరంజకముగ నుండును. నిరంతర నీలవర్ణముచే నొప్పెడి యీదృశ్యమును వివిధ సమయములందు జూచియే తీరవలెను గాని వర్ణించినను పారము ముట్టదు.

కృష్ణపుర మొకపురాతన గ్రామము. బ్రాహ్మణ గృహము లాయూర, నెండు. గ్రామమధ్యమున తటాకము. దానినంటి పురాణ ప్రసిద్ధమైనను సుస్థితిలోనున్న సూర్యనారాయణమూర్తి దేవాలయము పల్లెటూరియందము నినుమడింప జేయుచుండును. ఆయూరిలోని బ్రాహ్మణు లందఱును పండితులు. వేదాధ్యయన రతులు. ఆధునిక పద్ధతి ననుసరించి యాంగ్లవిద్య నభ్యసించినను విద్యార్థులు తమతమ యాచార వ్యవహారములను వీడలేదు. ఆంగ్లసాహిత్యము దారితేరిన వారైనను తమ యాచార వ్యవహారములను వీడలేదు. తమసాహిత్యము ప్రపంచములో నెల్లసాహిత్యములకంటె మిక్కిలి ప్రాచీనమైనదనియు, సత్యోత్తమమైనదనియు దృఢమగు నమ్మకము గలవారు. పురాణములను శోధించి, ఆదిమకాలమునుండి యాధునిక సమయము వఱకు ఇతిహాసమును, ఖగోళశాస్త్రమును సమగ్రముగ వ్రాసిన పండితాగ్రేసరులా గ్రామమున ననేకులుగలరు. మంత్రాది వివిధశాస్త్రములను పరిశోధించి యనేకయంత్రములను కనిపెట్టగల్గు శాస్త్రవేత్తలు పెక్కురాపురమున నున్నారు. ఆచార వ్యవహారముల ననుసరించుటలో ప్రవరుని నిరసించు బ్రాహ్మణు లనేకులాజానపదమున రాజిల్లుదురు. అగ్రజాతి తమతమ ధర్మములను వీడక ప్రాచీన కాలమునుండి వరలుచున్నదనిన, మిగిలిన మూడుజాతులవారు తమతమ ధర్మపథముల నడుచు చున్నారనిన నతిశయోక్తి కానేరదు. వేయేల! ఆకృష్ణపురము ప్రాక్పశ్చిమనాగరికతాసారమును జీర్ణించుకొని స్వర్గసుఖముల ననుభవించుచుండును.

కృష్ణపుర మీదిన మంతయు శూన్యముగ నుండెను. గ్రామములో మచ్చున కొక్క వ్యక్తియైనను లేదు, ఉన్న కొందఱునుకూడ గ్రామమున కనతి దూరమున నున్న

స్మశానము వైపు పరుగెత్తు చుండిరి. స్మశాన ప్రదేశమున నెక్కడ జూచినను హాహాకారములు నింగి ముట్టు చుండెను. గ్రామ మంతయు విశాల వటవృక్షము క్రింద చేరినది. వటవృక్షమున కనతి దూరమున నొక పెద్ద చితిపేర్చబడి యుండెను. దానిపై నొక నవయువకుని కళేబరము పరుండ బెట్టబడి యుండెను. దాని ప్రక్కగ పాతిక సంవత్సరముల వయస్సుగల యొక సుందరాంగి సర్వాభరణ భూషితయై కూర్చుండి యుండెను. సువర్ణ చ్ఛాయగల దేహమునకు తెల్లని చీర యొక విధమగు శోభ గూర్చుచుండెను. విశాలములగు నేత్రము లంజనము లేమిచే మిగుల శోభిల్లుచుండెను. శిరస్సున పాపట బిందిరీలు, పసుపు పూసిన ముఖముపై కుంకుమబొట్టు, మెడలో కాసులపేరు, కంటె, పాదముల కండెలు, కడియములు గలిగి యాయువతి సీతయో సావిత్రియో యన నొప్పుచుండెను. చితి ముట్టించ బడెను. గ్రామాధికారులు కాగితములను కలములను గైకొని సమీపమున నిలచి యుండిరి. ఆసుందరి లేచి చితికి మూడు ప్రదక్షిణములు గావించి యిట్లు పల్కెను. "నాకీ ప్రపంచమున నాపతి కంటె వేఱు దైవముగాని, దిక్కుగాని లేడు. ఆతడు నన్ను, నేనాతని మిక్కుటముగ ప్రేమించు కొనుచుంటిమి. అతడు లేనిది నాకీలోకమున నుండు టనవసరముగాన నేనాతని యనుసరింప నాయుసురులను వీడుచున్నాను. ఇట్లు సతియగు నాచారము ప్రస్తుత పద్ధతుల ననుసరించి న్యాయ విరుద్ధమైనను, నాయంగీకారముపైననే నేను నాపతి ననుసరించుటకు ప్రాణత్యాగము గావించుచున్నాను." ఇంతలో నాల్గువైపుల నుండియు అగ్నిజ్వాల లావరించుచుండెను. గ్రామాధికారు లేమిచెప్పుటకును చేష్టదక్కి యాసతి వాఙ్మూలమును మాత్రము వ్రాసికొనిరి. ఆయువతి మఱల త్రివారప్రదక్షిణము గావించి మోడ్పుహస్తములతో దహనముగానున్న పతికళేబరము చెంత శాంతచిత్తముతో కూర్చుండి పోయెను. ప్రేక్షకుల నయనములు బాష్పపూరితములై పోయెను. పతివ్రతాతిలకముల నీమె మించి పోయెనను ధ్వను లెల్లెడలనుండి వినవచ్చుచుండెను. అర్ధగంటలో చితి భస్మమయమై పోయెను. ఎద్దియో పోగొట్టుకొనినవారివలె చేష్టలుదక్కి యెచ్చటివార లచ్చటకుపోయిరి. గ్రామోద్యోగు లీ 'సతి' సంగతి, యామె వాఙ్మూలమును తాలూకాకచ్చేరికిని, దండనాధికారులకును వ్రాతమూలముగ నెఱింగించిరి.

కృష్ణశాస్త్రి వంశసంప్రదాయముల బ్రసిద్ధికెక్కిన పండితకుటుంబమున జన్మించెను. మంచి సంస్కృత భాషాజ్ఞానము గలవాడు. ఆంగ్లభాషలో యం. ఏ. యందు కృతార్థుడు. విశేషించి యాంగ్లభాష నభిమానవిషయముగ చదువుటచే పశ్చిమఖండ వాసుల యాచారవ్యవహారముల నామూలాగ్రముగ గ్రహించెను. కాని సంస్కృత సాహిత్యమునుగూడ మధించిన వాడును, స్వతఃసిద్ధముగ భారతీయ బ్రాహ్మణుడును

అగుటచే సనాతనవైదికధర్మపుటాచారముల ననుకరించెను. పాశ్చాత్య విద్య యాతనిపై తనప్రభావమును జూపలేక పోయెను. ధనికుడగుటచే కృష్ణశాస్త్రి యుద్యోగమున కాసింపక గ్రంధపఠనముననే కాలక్షేపము జేసికొనుచు నింటనే యుండి పోయెను. త్రికాల సంధ్యావందనము, జపము, నిష్ఠ, నియమము గలవాడాతడు. అతని జూచినవారలెవరు అత డాంగ్లవిద్యాపారంగతుడని యనుకొనరు. మాతాపితృసేవా తత్పరుడైన కృష్ణశాస్త్రి యింటనేయుండి వారికి సపర్యలుగావించుచు, వారి ప్రేమానుగ్రహములకు పాత్రుడగుచుండెను.

రుక్మిణీదేవి, కృష్ణశాస్త్రి భార్య; భర్తవలెనే మంచి సంస్కృతజ్ఞానముగలది. ఆమె యాంగ్లవిద్య నభ్యసింపలేదు గాని అనురూపుడును, విద్యాధికుడునగు పతి సాహచర్యమువలన యాతనినుండి యాధునిక జ్ఞానమును సంపాదించినది. వార్తాపత్రికలను, మాసపత్రికలను చదివి తన తెలివితేటలను నిరంతరము వృద్ధిగావించుకొనుచుండెను. స్వతఃసిద్ధముగ స్త్రీ విశేషించి భర్తను ప్రేమించి, యాతనినే తనదైవముగ నమ్మినయామె. అతనిని ప్రతివిషయమున ననుసరించి యుండెడిది. పతికి నచ్చిన సతి. సతికి నచ్చిన పతి. వారి యభిప్రాయములకు మధ్య నేవిధమైన తిరస్కరిణియును లేదు. ఇక వారి దాంపత్య సౌఖ్యమును గూర్చి వేతే చెప్పవలయునా? గ్రామములోని నవ యువకులకు, యువతులకును వా రాదర్శదంపతులు. భవభూతిరచిత దాంపత్యము వీరియనురాగమునకు దిగదుడుపు. అట్టి దంపతులలో నేయొకరు గతించినను రెండవవా రనుసరించుటలో నతిశయోక్తి, అస్వభావికము నెంతమాత్రము నుండవు.

సహగమనపు పద్ధతి అక్బరుకాలములో నైననేమి, విలియం బెంటిక్ ప్రభువు సమయమున నైననేమి భారతదేశమున సంతరించి పోయినది. ప్రస్తుత మిరువదవ శతాబ్దమున దానిపేరుకూడ నెఱుగనివార లనేకులుగలరు. అనేక యువతులు బలవంతముగ సహగమనము చేయింపబడుచుండుటచే సున్నిత హృదయముగల అక్బరున కీయాచారము చాలవఱకు క్రూరముగ గన్పట్టినది. అందుచేతనే యాతడు దానిని మాన్పుటకెన్నియో ప్రయత్నములను గావించి చివఱకు కొంతవఱకు కృతకృత్యు డయ్యెను. ఆంగ్లపరిపాలన మారంభమైన తరువాతకూడ యీయాచార మున్నట్లు కన్పట్టుచున్నది. బెంటిక్ ప్రభువు చట్టమును నిర్మించి సహగమనము చేసినవారిని, ఆ విషయమునకు చేయూత నొసంగిన వారినికూడ శిక్షింప ప్రారంభించెను. అప్పటినుండియు నీయాచారము క్రమక్రమముగ క్షీణించి తుద కంత మొందినది. గ్రామోద్యోగస్థు లెచటనైనను సహగమనము జరిగినచో ప్రభుత్వమువారికి తెలుపవలెనను నిర్బంధముండుటచే కృష్ణపుర గ్రామోద్యోగస్థులుకూడ రుక్మిణీదేవి వాఙ్మూలముతో కూడ 'రిపోర్టు'చేసి పోలీసు వారికి విషయము నెఱింగించిరి.

(సశేషము)

### శిశువివాహ నిరోధక శాసనాధిష్ఠాత

# హర్ బిలాస్ సర్దాగారు

శ్రీయుత వంగోలు వెంకటరంగయ్యపంతులుగారు బి. ఏ., బి. యల్.

ఈ మహాశయుల పేరులోని కడపటి భాగమును "సర్దా" శబ్దమును సరిగా పలుకలేకనో లేక అర్థము తెలియకనో "శారదా" శబ్దముయొక్క వికృతియను భ్రమచేతనో వీరిని లోకవాడుకలో శారదాగారనియు, వీరి శాసనమును "శారదా బిల్లు" అనియు పలుకుచుండుటగలదు. వీరి పేరులోని "హర్" అను పదము "హర" శబ్దము. విలాస శబ్దము మన వాడుకలోనివె. "సర్దా" యనునది వీరికి సంబంధించియుండు మాహేశ్వరి వైశ్యశాఖలో నొక యంతశ్శాఖానామమని తెలియుచున్నది.



వీరి తండ్రిగారి పేరు శ్రీ హర్ నారాయణ సర్దాగారు. తల్లిగారి పేరు తెలియుటలేదు. వీరు మార్వాడీ దేశపు వైశ్యులలో మాహేశ్వరి తెగవారు. ఆదేశపు వైశ్యులలో ననేక తెగలున్నవి. ఖండేల్వాలా, పూర్వాలా, మహేశ్వరి, అగర్వాలా, ఇత్యాదులు. ఇపుడు వైశ్యులనబడువారందరు మొదటినుండియు మూడవ జాతియను వైశ్యజాతి వారు కారు. క్షత్రియ జాతులవారును కొందరు కులోచిత యుద్ధాది వ్యాపారములను మానుకొని శాంతి సమృద్ధిని కోరినవారై వైశ్యవృత్తుల నవలంబింపసాగి కాలక్రమమున వైశ్యులుగనే పరిగణింపబడుచున్నారు. ఈ మాహేశ్వరులనబడువారును క్షత్రియాంకురమును ప్రథమమున కలిగియుండి వీరవిక్రమముల జాలించి మహదైశ్వర్య ప్రేప్సులై వైశ్యధర్మముల నవలంబించి కాలక్రమమున వైశ్యులగణములలో చేరినట్లున్నది. ఇటులాచారానుష్ఠానముల మార్చుకొని వైశ్యధర్మముల నవలంబించి కాలగతిచే వైశ్యులయినవారిలో ఈ మాహేశ్వరులుకూడ చేరినవారని సందేహింప నవకాశమగుచున్నది. ఈ వర్ణవ్యత్యయములనుగూర్చి శ్రీ సర్దాగారే మే 28-12-24 ప్రాంత్యముల బారిల్లిలో (Bareilly) జరిగిన అఖిలభారతీయ వైశ్యమహాసభకు ప్రెసిడెంటుగానుండిన సందర్భములో తమ మహోపన్యాసమున ప్రస్తావించినటులున్నది.

వీరి తలిదండ్రులకు వీరొక్కరే కుమారులు. తోబుట్టువు వొకర్తుయుండి ఆమె 1892 సెప్టెంబరులో స్వర్గస్థురాలయినది. మన హర్‌బిలాస్ సర్దాగారు 1867 న జూన్ నెల 3-వ తేదికి సరియగు శాలివాహన శక గత వర్షంబులు 1789 ప్రభవనామసంవత్సర జ్యేష్ఠ శుద్ధ ప్రథమా సోమవారమున ఆజిమేరు పట్టణమున జన్మించినారు.

వీరి తండ్రి హర్‌నారాయణ సర్దాగారు ఆజిమేరులోని గవర్నమెంటు కాలేజిలో లైబ్రేరియన్ (పుస్తకభాండారాధికారి)గనుండి ఆ భాండారముననుండిన గ్రంథముల బహు జాగరూకతతో శోధించుచు అందున్న మత, భాషా, వేదాంత, వైజ్ఞానిక గ్రంథములనన్నిటిని తల స్పర్శగ చదువుచుండెడివారు. మన హర్‌బిలాస్ సర్దాగారును చిన్నతనముననుండి తండ్రిగారికి ఈ గ్రంథశోధనపరన వ్యవహారములలో తోడ్పడుచుండి నానా విషయకగ్రంథముల చదువుటయందు ప్రవేశము కలిగించుకొనిరి. తండ్రిగారి మనోవృత్తి తత్త్వవిచారప్రసక్తముగను వాదప్రతివాద కుతూహలముగలదిగను యుండినది. ఏవిషయమును గాని పూర్వపక్ష సిద్ధాంతముల ననుసరించి విమర్శజరిగించి నిర్ణయమునకు వచ్చువారు. తండ్రిగారి పారశీలతయు సదసద్విచార పూర్వక విషయనిర్ణయాది సద్గుణములను క్రమశః కుమారునికి యలవడి వారియందు పెంపొంది వారి భావి ప్రఖ్యాతికి ఆధారములయినవి.

ఆ కాలమున స్త్రీవిద్య విశేషవ్యాపకము పొందకయుండినను హర్‌నారాయణ సర్దాగారు తమ కుమారితకు హిందీ నేర్పిరి. ఒకమారాయన అశక్తుడై రోగపీడితుడైయుండగ హిందీలో యోగవాసిష్ఠమను ప్రౌఢ వేదాంతగ్రంథము నాయనకు చదివి వినిపించుచు ఆయనకు ఆధ్యాత్మిక సంతుష్టి గలుగజేయుచుండినది. వీరును, వీరిభార్యయు ఆ కుమారితయు 1892 లో వెంటవెంట స్వర్గస్థులయిరి. ఈయనకు సన్యాసుల తోటియు సాధువులతోటియు కలయిక ఎక్కుడుగనుండి సదా వేదాంతప్రచారము విచారము సలుపుచు బ్రహ్మవిచారమునం దాసక్తులైయుండిరి.

మన హర్‌బిలాస్ సర్దాగారు ఆజిమేరున చదువు ప్రారంభించి 1883 లో మెట్రిక్యులేషన్ పరీక్షయందును 1885 లో యఫ్యే (అనగా ఇప్పటి ఇంటర్మీడియెటు) పరీక్షయందును కడతేరిరి. బి ఏ పరీక్ష కొరకు ఆగ్రా కాలేజచేరి అచట ఇంగ్లీషుభాషను పార్శిభాషను (పర్షియన్) వేదాంతశాస్త్రమును చక్కగ నభ్యసించి ఇంగ్లీషు ఆనర్సులో యునైటెడ్ ప్రావిన్సెస్సు (సంయుక్తరాష్ట్రములు)లోని కాలేజిలో జదివి కలకత్తా సర్వవిద్యాకళాశాలా (యూనివర్సిటి) పరీక్షలకు బోయినవారిలో అగ్రస్థానమును బొందెను. ఇంగ్లాండుకుబోయి ఆక్సుఫోర్డు యూనివర్సిటిలో బి ఏ పరీక్షకుచదివి అచట నాపట్టమును బొందవలయునని, బారిస్టరు పరీక్షకుచదివి యుత్తీర్ణుడు కావలయునని వీరికి విశేషముగు కోరిక కలిగియుండినది. వీరును, వీరి పారంపర్య కుటుంబమిత్రులును సహాధ్యాయులును ఇంగ్లీషులో వీరి సంక్షిప్తచరిత్రమును వ్రాసినట్టియు రామగోపాల్ అను కాయస్థులొకరు 1888 అక్టోబరులో ఇంగ్లాండునకు పోవ తలబెట్టుకొనియుండిరి. అయితే ఆ కాలమున సర్దాగారి తండ్రిగారు వార్ధక్యమువలనను, జాడ్యగ్రస్తులయి యుండినందునను వీరి ఇంగ్లాండు ప్రయాణము సాగలేదు. వీరి ఆప్తమిత్రులు రామగోపాలుగారు మాత్రము అనుకొనినప్రకారము ఇంగ్లాండునకుపోయి బారిష్టరి పరీక్షనిచ్చి విద్యాధికులై తిరుగ ఇండియాకువచ్చి బారిష్టరుగనుండియు ఇంగ్లీషున డైనామిక్ సోషియాలజి, పొలిటిక్ థాట్సు, రిఫ్లెక్షన్ అండు ప్రావెర్బ్సును, ఇంగర్సాలు గ్రంథముల నుండి సెలెక్షన్సులోనగు గొప్పవిచారముల నెరసియుండు గ్రంథములువ్రాసి ప్రతిష్ఠజెందిరి

సర్దాగారి యుద్యోగదశ 1889 లో ప్రారంభమయినది. ఆ సంవత్సరమున ఆజిమేరులోని గవర్నమెంటు కాలేజిలో జ్యేష్ఠోపాధ్యాయ (సీనియర్ టీచర్) గణమున నొక యుపాధ్యాయులుగ నియోగింపబడిరి. అందు కొంతకాలముండి 1892 నందు ఆజమేరు మెర్వారా పరగణాయందలి జూడిషియల్ డిపార్టుమెంటుకు (న్యాయపాలనశాఖ) మార్పబడిరి. అందుండగ, 1894 లో ఆజిమేరు మెర్వారా పరగణా చట్టములను నిబంధనలను (లాస్ అండు రెగ్యులేషన్) పరిశీలించి సవరించు నధికారమును

బొందిరి. ఆ సంవత్సరమునందే వీరు హిస్ హైనెస్ జైసాల్మీరు మహారావల్ గారి పాలకులుగ (గార్డియన్) నియమింపబడిరి. (రావల్ అనగా మహంతువలె ధర్మాధికారముగల గొప్పపదవి) ఆ అధికారమును కొంతకాలము సాగించి 1902 లో గవర్నమెంటులో జ్యుడిషియల్ డిపార్టుమెంటును తిరిగివచ్చిచేరిరి. అజిమేరు పరగణాలో కొంతకాలము అసిస్టెంటు కమీషనరుగను ఉత్తమాంతస్తు సబుజడ్జిగను, అజిమేరునందే స్మాలుకాజు కోర్టు జడ్జిగను (1921-23) కడపట అజిమేరులో అడిషనల్ డిస్ట్రిక్టు అందు సెషన్సు జడ్జిగను శ్లాఘ్యముగ నుద్యోగములజేసి 1923 డిశంబరులో పింఛను బొందిరి.

ఈ యుద్యోగములుగాక 1894 నుండి ఎనిమిదేండ్లు వీరు అజిమేరు మునిసిపల్ కమీషనరుగనుండిరి. 1923 లో పింఛను పొందియు రాజపుత్ర స్థానములోని చీఫ్‌కోర్టుముఖ్యన్యాయ స్థానమున 1925 లో జ్యేష్ఠ న్యాయాధికారిగ నుండిరి. (సశేషము)




'కిరణ్'

నవభారతనారీ! నవోన్మేషచరితా!
దిగంతవిశాల విస్తృతగత శుభచరితా!
దేశంకోసం జీవితమిచ్చిన
యీవీరనారి కథవిన్నావా?
క్రీస్తుకుపూర్వం కీర్తికాములై
విజృంభించిరి వీరరోమనులు
ప్రచండమైనా అఖండధాటికి
ఫ్రాన్సుగ్రీసులూ వారికిలొంగెను.
ఆనందించిరి క్రూరచైదముల
ఆక్రమించిరీ ఆంగ్లరాజ్యమును
ప్రజలశాంతినీ కొల్లగొట్టిరీ
ప్రజలస్వేచ్ఛనూ గైకొనసాగిరి
స్వేచ్ఛనుకోరిన స్త్రీలనుపురుషుల
తరిమితరిమి మరి పట్టివధించిరి
అంతటనిండెను హాహాకారము
లల్లల్లాడిరి ఆంగ్లజనులపుడు.
ఆంగ్లదేశమున ఐసెనిరాజూ
అకాలమృత్యువు కాహుతయ్యెను
అంతటరోమను లైసెనిభాగము
నాక్రమించిమరి రాజబంధువుల
నెన్నోయిడుముల కెరగావించిరి
పెక్కుగృహమ్ముల కగ్నిరగిల్చిరి.
బొడీషియాయను బోటిబకత్తిక
ఐసెనిరాజుకు నెయ్యపురాణి;
రాణికూతులను రాణియెదుటనే
రోమనుక్రూరులు భంగపఱచగా
రాణిహృదయమున రగిలెనుఅగ్ని
మేనుమరచిమరి సొమ్మసిల్లుతరి
కఱకుకంబమున విరిచికట్టి—పెను
కొరడాల్ పట్టి కొట్టిపోయిరి.
అబలనుకొట్టిన అధములనందర
పట్టివధింతు ననిబొడీషియా
కృతనిశ్చయమై ముందుకుసాగీ
ప్రబోధించెనిటు లాంగ్లవీరులను,
"ఆంగ్లరక్తము మీలోలేదా
ఆంగ్లతేజమే అడుగంటినదా
శత్రులదునిమి స్వేచ్ఛనుపొందగ
అస్త్రధారులై ఆజికి నడవుడు!"
రోమునుపాలన రోసీ—అత్తరి
ఆంగ్లవీరలూ బాలురుతరుణులు
ప్రబుద్ధులై అతి ప్రచండధాటిని
రోమనుప్రభువుల రోదనలెగయగ
విప్లవాగ్నులను మిన్నుకునెత్తిరి
విజయనాదముల విజృంభించిరి
రోమనునగరము లాక్రమించిరీ
రోమనుదొరలను కాల్చిచంపిరీ
వారిధాటికీ రోమురాజ్యమూ
కాంతులుడిగెను కలవరమొందెను.
అంతటమేల్కొని పాలకప్రభువులు
అయ్యో! అయ్యో! యిదేమిచిత్రం!
నాయకురాలొక నారీమణియట!
సాయుధబలముల నాక్రమించెనట!

ప్రతిష్ఠనిలుపగ ప్రబలసైన్యములు
శీఘ్రమె శత్రుల చీల్చండంటూ
వీరవరులనూ పెక్కురనేరీ
సేనావాహిని చేర్చిపంపిరి
విజృంభించిన శత్రుసైన్యమును
విప్లవవీరులు ఎదిర్చిపోరిరి
వీరులరక్తం యేరులుపారెను
వీరులతేజం మిన్నుముట్టెనూ
అసువులపై తమ ఆశలువీడీ
వీరులుపోరీ తనువులబాసిరి.
నాయకురాలిని పట్టినవారికి
రాజ్యభాగమును యిస్తామంటూ
రోమనుదొరలూ చాటిచెప్పగా
రోము సైన్యమూ విజృంభించెను
చుట్టుముట్టినా రోమనుక్రూరుల
చీల్చిచీల్చి పెనుపోరునుసలిపీ
శత్రులచేతికి చిక్కనటంచూ
కత్తినిత్రిప్పీ హృదిలోదించీ
ఇరువాగులకూ విస్తుకలుగగా
వీరనాయకీ నేలకువ్రాలెను.
స్వేచ్ఛనుకోరీ జీవితమిచ్చిన
వీరనారినీ విస్మృతింతువా ?
సామ్రాజ్యవాద సంభరితులనిటు
చీల్చిచంపగా క్రీస్తుపూర్వమె
ప్రబలయత్నములు ప్రజలుచేసిరని
చరిత్రలన్నీ చాటిచెప్పినవి
నవభారతనారీ! నవోన్మేష చరితా!
దిగంతవిశాల విస్తృతగత శుభచరితా!



# శారద లేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు

నెచ్చెలీ !

నీవు వ్రాసినట్లు డిశంబరు గృహలక్ష్మిలో 'మద్రాసు మహిళా సభలు' అను శీర్షికతో వ్రాయబడిన సంపాదకీయవ్యాఖ్య సముచితముగను సమయోచితముగను నున్నదనుట నిస్సంశయము. ఇంచుమించుగ యిరువదేండ్లుగ మహిళాసభలు జరుగుట చూచుచున్నాము. ఏనాడైన యిట్టి అశాస్త్రీయ వ్యవహారములు చూచితిమా ? మన రాష్ట్ర మహిళా సభలో అన్ని మతములవారు హిందూ మహమ్మదీయ క్రైస్తవ పార్శీలును కలిసి పనిచేసి యుండలేదా ? అన్ని కులములవారును కలిసి నిర్వహించి యుండలేదా ? మతభేదములనియు, వర్ణభేదములనియు, వర్గభేదములనియు, వింతవింత మాటలను యీనాడు వినుచున్నాముగాని యింతకు మునుపు ఎప్పుడైనను వినియుంటిమా ? మా మహిళాసభ భారతీయ మహిళామండలి కంతయు ప్రాతినిధ్యము వహించినదనియు దీనిలో జాతి మత వర్ణ వర్గ విచక్షణ లేనేలేదనియు, కావున మాకు ప్రత్యేక ప్రాతినిధ్యములు వలదనియు, రౌండుటేబిల్ మహాసభలో కాంగ్రెసు తరువాత ఘంటాపథముగ చెప్పిన సంస్థ యిదియేకాదా. ఆలిండియా కాంగ్రెసు తరువాత జాతి మతాదుల కతీతమైన సంస్థ యిదియేయని గర్వముతో చెప్పుకొనుచున్న వారము కామా. అట్టి విశాల మహోదార సంస్థకు నేడెట్టిగతి పట్టినది. తలచిన మనసు నీరైపోవుచున్నదిగదా. అందును మన ఆంధ్రరాష్ట్ర మహిళాసభ పొందిన పతనావస్థను చూచిన ఎంతయో సిగ్గిలవలసి ఉన్నదిగదా. మహిళాసభ లెందుకు పుట్టినవి ? వాని యుద్దేశమేమి ? మహిళాభ్యుదయమునకేగదా. ఇందు సంఘసేవయే లక్ష్యముగాని పదవీ వ్యామోహము లక్ష్యముగాదే. మహిళాభివృద్ధియే పరమార్థముగాని మన్నన పదవుల కాస్కారములేదే కాలమొకరీతి నుండదు కాబోలు మూడు కొప్పులుగాదు నూరు కొప్పులును నొకచోటు ఇముడగలవని నిరూపించిన మహిళాసభ నేడు పాత సామెతను పైకి వచ్చునట్టుగా వ్యవహరించుట యెంత శోచనీయము ! పాపము శమించునుగాక.

ఏవర్గమో ఏవర్ణమో అభివృద్ధికి రావడమూ, ఏవర్గమునో ఏవర్ణమునో అడుగునకు త్రొక్కడమూ మహిళాసభల లక్ష్యమైతే, అఖిలభారత మహిళాసభకూడ యీ సంకుచిత తత్వమునే బలపఱచునదైతే ఈ సంస్థను ఎంత త్వరలో రద్దుచేసిన అంత మేలు. అట్లుగాక ఏవేవో కారణములచే భేదాభిప్రాయములు కలిగినప్పుడు వానిని సవరించి లక్ష్యము చెడకుండా సత్యమార్గమున నడిపింపగలదేని అఖిల భారత మహిళాసభ తన ఉనికిని సార్థకమొనర్చుకొనగలదు.

అయినను అఖిలభారత మహిళాసభవచ్చి తీర్పు దిద్దువఱకు మన రాష్ట్రగాథ లేల పోవలెను ? ఆంధ్రదేశమున విద్యావతులు లేరా ? ఉన్నతోన్నత పదవు లధిష్ఠించి అనుభవము గడించిన వారును గడించు చున్నవారును లేరా ? వారు తమ అనుభవమును, తమ పలుకుబడిని, భేదాభిప్రాయములు గోరంతలు కొండంతలుజేసి సంఘ గౌరవమును వమ్ము చేయుటకు వినియోగించుటకంటె ఐకమత్యమును సంఘటిల జేయుటకు వినియోగించిన ఆంధ్రస్త్రీల యశస్సు యినుమడించునుగదా. కాని దురదృష్ట

వశమున మన స్త్రీల కట్టి తలంపు కలుగక ప్రతి సంఘస్థాపనకు ప్రోత్సాహ మిచ్చుటకే యత్నించుట విచార కరము గదా.

మహిళా సభలను గుఱించియేగాక వాని పేర వసూలగుచున్న చందాలను గూర్చిగూడ గృహలక్ష్మి సంపాదకీయము హెచ్చరించినది. నిజమునకు ప్రజాధనము మన సొత్తుగాదు. దానిని ఎంత శ్రద్ధతో వసూలు చేసితిమో అంత శ్రద్ధగా వినియోగించుట యందును, నిక్కచ్చిగా లెక్కవ్రాసి ఉంచుట యందును, ఎప్పుడడిగిన అప్పుడు ప్రజాసమ్ముఖమున పెట్టుట యందును సంసిద్ధులై యుండుట ప్రజాహిత కార్యములు చేయువారి ముఖ్యవిధి ఏవిషయమునందైన ఉపేక్షయు, తిరస్కారమును, ధిక్కారమును ఉండవచ్చునుగాని డబ్బు విషయములో మాత్రమిట్టి దొసగు పనికిరాదు. ఇందులో ఏకించిత్తు లోపము వచ్చినను ఎంతటి వారును గౌరవచ్యుతులై పోవుట మనము కండ్లార చూచుచున్నదే. ఒకమారు ప్రజావిశ్వాసము గోల్పోయిన వెనుక మరల దానిని లక్ష వరహాలిచ్చినను సంపాదించుట ఏరికిని సాధ్యముగాదు. ప్రజావిశ్వాస మనునది పోయిన వచ్చునదియుగాదు ధనమునకు దొరకునదియుగాదు. ప్రత్యామ్నాయముగ మఱియొకటి చూపుటకు వీలైనదియుగాదు సంఘసేవాపరాయణుల జీవన్మరణములు వీనిలోనే యున్నవి. ఇవి బయట పడకుండుటకు సంఘబలిమి కొన్నాళ్లు తోడ్పడ వచ్చును. ద్రవ్యబలము కొన్నాళ్లు రక్షించ వచ్చును అధికారబలము కొన్నాళ్లు కాచవచ్చును. కాని ఎల్లకాలము అకృత్యమును కప్పిపుచ్చగల మహత్తరశక్తి యేదియులేదు. నిజము నిలుకడమీద తెలియుననునది, నిత్యసత్యము నగ్నసత్యము. దానిని కాదనుటకు మానవులకు శక్తిలేదు. అది భగవత్స్వరూపము.

ఆంధ్రమహిళాసంఘములో చెలరేగిన వివాదములు కమ్యూనిష్టు కమ్యూనిష్టేతర వివాదమని సంపాదకు లభిప్రాయ పడినారు. కాని ఇది పొరబాటు. కమ్యూనిష్టు లేనాడో ఈ మహిళాసంఘముతో విడిబడి ప్రత్యేకసంఘ మేర్పరచుకొనిరి. దాని ద్వారానే వారు పని సాగించుకొనుచున్నారు. ప్రస్తుతము ఆ సంఘము వారిలో అనేకులు బందీకృతులై యున్నారు. కాన యీ వివాద వారికి సంబంధించినదికాదు. ఇది ముమ్మూర్తుల కులతత్వమునకు సంబంధించినది. ఇది యీ మహిళాసభకొక్క దానికి పట్టిన దోషమేకాదు లెమ్ము ఇది దేశమంతటను అన్ని ప్రజాహిత సంస్థలను ప్రభుత్వ సంస్థలనుగూడ పట్టిన పీడ. ఇది అమృతోద్భవమునకు ముందు బుట్టిన హాలాహలము. దీనిని పానము సేయగల గరళకంఠులు కావలెను. దేశ పరివ్యాప్తమైన యీ విద్వేషభావమును సమయించి శాంతి సామరస్యమున కెవరు కృషి జేతురో, వ్యక్తుల ప్రత్యేక కులాచారముల దెసకుపోక ఎవరు న్యాయమైన దేశాభ్యుదయ కాంక్షతో పనిజేతురో, వారు స్త్రీలుగాని పురుషులుగాని, వారే దేశకల్యాణ ప్రదాతలు. వారే ఐక్యతనే అమృతమును సృష్టించి పానము చేయించగలవారు. ఆంధ్రమహిళామణులలో అట్టి ప్రతిభాశాలినులు లేరా?

సకాలమున గృహలక్ష్మి సంపాదకులు గావించిన హెచ్చరిక ఆంధ్ర గృహలక్ష్ములకు కనువిప్పు. ఆంధ్రమహిళల కీర్తిని నిలబెట్టునేని వారి హెచ్చరిక సార్థకము కాగలదు ఆంధ్ర స్త్రీల యశస్సు విస్తరించగలదు.

కల్పలతా,

నిజమునకు మహిళల కిన్నిసభ లెందుకు? భారతదేశమునగల స్త్రీలందర మొకటే. మనకు కావలసిన అక్కర లొకటే, బాధ్యత లొకటే. తీర్చెడి ప్రభుత్వమును నొకటే, అగుచో వేర్వేరు సభలను స్థాపించుట సంఘబలమును క్రుంగదీసికొనుటగాదా. అనైక్యతను ప్రదర్శించు కొనుటగాదా. ఇట్టి కార్యమును చేయకుండుట మనకవసరంగాదా, యోచించుము.

మిత్రురాలు

శారద.

*

# గృహలక్ష్మికి పద్యరత్నాలు

కల్లూరు అహోబలరావుగారు

(అక్టోబరు సంచికతరువాత)

ఆహార విహారంబుల
దేహపుసామ్యంబులందుఁ దెలివ, మగనితో
నూహింప భేదపడితివె
నాహా ! సమతత్వమున్నదా ? గృహలక్ష్మీ !

తరుణులనైజము మార్దవ
మరుదారగఁగనికరంబు హత్తినహృదయం
బారునొవ్వల నోర్వనియది
పరికింపుము నాడునేడు వరగృహలక్ష్మీ !

పసిపాపల రక్షింపగఁ
బసదనమింపారునట్టి పాలిండ్లను, సాం
పెసగఁగ రమణుల కొసఁగిన
విసధరు నియమములఁ దెలియవే ! గృహలక్ష్మీ !

పుట్టగఁ బోయెడిబిడ్డల
పొట్టలకున్నాలుఁ బోయఁ బువుబోడులకే
దిట్టతనంబునఁ జెల్లును ;
పట్టీ ! ఈసూత్రమెఱుగవా ? గృహలక్ష్మీ !

పురుషులప్రకృతి కఠిన మా
దరణము కనికరము సున్న ; తాండవమాడున్
గరువము పిశాచగుణములు
పరికింపుము నాడునేడు వరగృహలక్ష్మీ !

మానవ శారీరక, వి
జ్ఞానము గ్రహియించినావె ? నాతులగర్భ
శ్రీనాణ్య రచనభంగిమ
జాణరొ ! గ్రహియింపువమ్మ ! జయగృహలక్ష్మీ !

(సశేషము)

# నిజమును పలికించు కంఠహారము

శ్రీమతి సర్వేపల్లి సులోచనాదేవిగారు

## బాలబాలికల కొక చిన్నకథ

ఒక వూళ్లో పెరల్ యనెడి యొక చిన్న బాలిక యుండెను. ఆ బాలిక ప్రతి చిన్న విషయమునకు అసత్యములాడుచుండెను. ఈ విషయమును ఆమె తల్లి దండ్రులు కొంత కాలము కనుగొనలేకపోయిరి. ఆ పట్టణమున 'సత్య' యనెడి యొక మంత్రగాడు వుండెను. మిక్కిలి అబద్ధములాడు వారిని అతని యొద్దకు గొనిపోయిన యెడల ఆతడు వారి మరలవాటును పోగొట్టు శక్తి గలిగి యుండెను. పెరల్ తల్లి దండ్రులు సత్యను గురించి చెప్పుకొను విషయములను విని "మన పెరల్‌ను సత్యవద్దకు గొంపోవుదము. అతడు యీ పిల్లయొక్క దుర్గుణమును పోగొట్టు"నని పెరల్ తండ్రి అతని భార్యతో పలికెను. ఈ మాటకు ఆమెకూడ ఒప్పుకొనెను. వారి బాలికను గ్లాసుభవనమునందు నివసించు సత్యవద్దకు పిలుచుకొని పోయిరి. పెరల్ తల్లి సత్యతో తమ కుమార్తెను గురించి చెప్పెను. అతడు "నాకు మీ పిల్ల విషయము బాగుగ తెలియును. ఎల్లప్పుడు అబద్ధములాడుచుండునని" చెప్పెను. ఈ మాట వినగనే పెరల్ మొహము కోపముచే, అవమానముచే చిన్నబోయినది అప్పుడు సత్య "నీవేమియు భయపడవలదు. నేను నిన్నేమి చేయను. నీ కొక వస్తువు బహుమానమిచ్చెద"నని పలికెను. వెంటనే యొక పెట్టె తెరచి యొక కంఠహారమును పెరల్ మెడయందు వైచెను. ఆ హారమునకు మధ్య నొక వజ్రము కలదు. సత్య పెరల్ తల్లి దండ్రులతో "యీ హారము మీ అమ్మాయి దుర్గుణమును పోగొట్టును. ఇంకేమి చేయ నక్కరలేదని" చెప్పి వారిని పంపివైచెను. మరదినము పెరల్ బడికి వెళ్లగనే తోడిబాలికలందరు చుట్టుమూగి ఆ కంఠహారమును చూచుచు "ఇది నీ కెక్కడిదని" ప్రశ్నించిరి. పెరల్ "యిది మా నాయన నా పుట్టిన పండుగకు చేయించెనని" అబద్ధమాడినది. బాలికలందరు "యీ వజ్రమును చూడుడు, చూడుడు నల్లగనయి పోయినదని" అరచిరి. పెరల్ వంగి వజ్రమును చూచుకొని చాలభయపడి "నేను మీకు నిజము చెప్పెదను, యిది నాకు సత్యయనెడి మంత్రగాడుయిచ్చె"ననెను. వెంటనే వజ్రము పూర్వపు కాంతితో ప్రకాశించెను. బాలిక లందరు నవ్వుచు యిక మీదట అసత్యములాడు వారి నందరిని సత్య యొద్దకు పంపవలయుననిరి. దానికి పెరల్ "మీరు నవ్వవలదు. మనము ఆతని యొద్దకు వెళ్లనక్కరలేదు. ఆతడే మనలను పిలుచుకొని వచ్చుటకు యొక పెద్ద బండిని పంపును. ఆ బండి రెండు ఏనుగులతో లాగబడుచున్నది. సత్య ముత్యములతో కెంపులతో చెక్కబడిన గృహమునందు నివసించుచున్నాడు. నేను అబద్ధములాడనని నన్ను చూచి చాల మెచ్చుకొనెను" అని పై విధముగ అన్ని అసత్యములాడినది. ఆమె మాటలాడినంతసేపు బాలికలందరు నవ్వుచుండిరి. అప్పుడు పెరల్ వంగి చూచుకొనగా ఆమె చెప్పు ప్రతి అసత్యమునకు హారము కొంచెము కొంచెముగ పెరిగి పెద్దదై నేల తాకినది. మరల పెరల్ భయపడి వారితో "నేను చెప్పిన దంతయు అబద్ధము. నిజము కాదని" పలికెను. వెంటనే ఆ కంఠహారము దాని పూర్వపు ఆకారమునకు వచ్చినది. ఆమె స్నేహితులందరు "అయితే సత్య నీకీహారమును యిచ్చునప్పుడు ఏమని చెప్పెను" అని అడిగిరి. దానికి పెరల్ "నీవు నిజము చెప్పెదవు గనుక నీకీహారము బహుమానమని నా కిచ్చెను" దీనికి పైన పెరల్ యొక పలుకైనను పలుకలేక పోయినది. ఆ హారము మిక్కిలి చిన్నదై ఆమె కంఠమును బిగ్గరగ చుట్టివైచినది. పెరల్ ఏడ్చుచు "లేదు, లేదు. నేనెప్పుడూ అసత్యములాడుచున్నానని సత్య నా కీ హారము నొసగ"నని చెప్పినది. ఈ మాట నుడివిన వెంటనే ఆ కంఠహారము యథాప్రకారము పొడుగైనది. అప్పటినుండి "యింక నేనెప్పుడు అబద్ధములాడను. అది చాల తప్పు, అవమానకరమైనది" అని పెరల్ ప్రమాణము చేసినది. హారము నొసగి సంవత్సరము కాకమునుపే సత్య పెరల్ వద్దకు వచ్చి "నీకిక యీ హారముతో పనిలేదు. నీ విప్పుడు అసత్యము లాడుటలేదు. దీనిని యీ మారు యొక బాలునకు వుపయోగించెద"నని చెప్పి గైకొని వెడలెను. కథ కంచికి మన మింటికి.



# స్త్రీ—మాతృమూర్తి

శ్రీమతి కనకంగారు

స్త్రీ జీవితము గులాబీ తోటవంటిది. అతిసున్నితము. అమితానందకరము. సంఘాభివృద్ధికి మూలకారణము స్త్రీ. దేశసౌభాగ్యమునకు పునాది మాతృమూర్తి. విజ్ఞానముతో గూడిన మాతృత్వము, బంగారమునకు వాసన అబ్బినట్లుండును. పసిపిల్లల భవిష్యత్తునకు మాతృక మాతయే. ఆమెపోయు ఉగ్గుపాలలోనే ధైర్యము వెల్లివిరియుచున్నది. ఆమె నేర్పు ఆటపాటలలోనే వారివిజ్ఞానకుసుమము వికసించును. "విజ్ఞానవతియగు స్త్రీ నూర్గురు ఉపాధ్యాయులకంటె గొప్పది." అనినాడొక అనుభవశాలి.

మాతృత్వం వహించని స్త్రీజీవితము సఫలత గాంచనేరదు. గృహమునే ఒక దేశముతో పోల్చినచో స్త్రీయే ఆదేశమునకు ప్రధాని. దేశమునకు స్త్రీపురుషులిరువురు సమానులే. అయినప్పటికి బాగుగా ఆలోచించిన స్త్రీకే బాధ్యత యెక్కువ.

ఆమె సంసారమునకేకాకుండ సంఘమునకుకూడా పునాదివంటిది. కత్తిపోటు కంటె కలముపోటెంతగొప్పదో రాజకీయములకంటె గృహనిర్వహణకూడ అంతగొప్పదే. గవర్నర్ జనరల్ రాజాజీ ఒకప్పుడు బాలుడుపొందే బి. యే (B A). డిగ్రికంటె బాలిక పొందె తల్లిడిగ్రి తక్కువదికాదన్నారు. ఇటువంటి పవిత్రస్థానమున కధికారిణియగు స్త్రీకి కావలసినవి, శిశుపోషణకు వలయు విద్య, ధైర్యోత్సాహముల పెంపొందింపచేయుటకు వలయు విజ్ఞానము, శిశువుజన్మించినది మొదలు పదిసంవత్సరములవరకు తల్లితీసికొనవలసిన జాగ్రత్త. చంటిపిల్లలు నిస్సహాయులు. వారి ఆహారాదివిషయములన్ని తల్లిపైననే ఆధార పడియుంటాయి. మనమెట్టివిత్తనములు చల్లుదుమో అట్టివంటయే మనకు లభించును.

పసిపిల్లల ఆరోగ్యమును కాపాడవలసినది తల్లి. తలిదండ్రుల సత్‌శీలసంపన్నతలను బట్టియే పిల్లలభివృద్ధి నందుదురు.

స్త్రీలకు, ప్రసూతి శిశుపోషణ శాస్త్రాలకు ప్రత్యేకవిజ్ఞానోపార్జన అత్యంతావశ్యకము. దీనికై ప్రత్యేకకృషిచేసి జ్ఞానధనులై బాలబాలికలను భావిదేశపౌరులగాను తయారుచేయాలి.

సోదరీమణులారా! మన పుత్రీపుత్రులను గొప్పవీరులుగ, విజ్ఞానఘనులుగ తరిఫీదుచేయుటకు మించిన దేశసేవ వేరేమియులేదు. ఆనాడే మాతృమూర్తి పవిత్ర మాతృస్థానా న్నందుకుంటుంది.



# రీటా తలవెండ్రుకలను పెంచును

రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటివెండ్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెండ్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెండ్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనకువేలు వాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

**లలితాపావర్ :** ఉత్తమమైన హెయిర్ టానిక్ కోరేవారికి రీటాకు మించినది మరేదీ లేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

**సుశీల్ కుమార్ :** రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం. శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

**కన్నాంబ :** రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

**పుష్పవల్లి :** నాకు సుమారు ఏడాదిగా తల వెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్ఠమైన హెయిర్ టానిక్ అని నా అభిప్రాయము.

**సూర్యకుమారి:** రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనము నుచేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

**కృష్ణవేణి:** రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. తల వెంట్రుకలను రాలకుండాచేసి, కొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

**ఆర్. పద్మ:** నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది.

**లక్ష్మీబాయి:** తలవెండ్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

**వసుంధరాదేవి:** శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజరక్షణకు రీటా అమోఘమైనదిగ రుజువైనది.

**రాజమ్మ :** శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుకున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘ వినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్

# అభిసారిక

శ్రీమతి ఏ. పి. కుమారిగారు



అది శ్రావణ బహుళ అమావాస్య. అంబర పథం మేఘావృతమై కన్నుచించుకొన్నా కనుపడని కారుచీకటి లోకాన్నంతటినీ ఆవరించింది. వాయువు ప్రచండంగా వీస్తూంది. నగర దీపికలన్నీ వాయుదేవుని ఆగ్రహానికి బలయ్యాయ్. బలవంతులదే రాజ్యం కదూ! కోటవెలుపలి ద్వారంవద్ద బౌద్ధసన్యాసి ఉపగుప్తుడు మైమరచి నిద్రిస్తున్నాడు. నగర గృహద్వారాలన్నీ బంధింపబడ్డాయ్. హఠాత్తుగా ఏదో పాదతాడనం జరిగింది. అతనిహృదయం అందెలమ్రోతవిని త్రుళ్ళిపడింది. మెల్లగా కనులవిప్పి నలువైపులా పరికించాడు. తేజోవంతమైన అతని నయనద్వయాలలో చిన్న ఆశ్చర్యపు మెరుపు మెఱిసి అంబరపథంలోని బంగారుతీవెలకు జోడు కలిపింది. తన చలువచూపులను వాసవదత్తమీద ప్రసరించాడు. ఆమె మధురానగరంలో ప్రసిద్ధికెక్కిన నర్తకి. నవనవలాడే నిండుజవ్వనం ధరించిన చీనిచీనాంబరంలోనుండి తొంగి చూస్తోంది. తీర్చి దిద్దబడిన తిలకం ఆసుందర వదనారవిందానికి క్రొత్తవింతకాంతుల్ని వెదచల్లుతూ నూతన శోభను గూర్చుతోంది. నానావిధాభరణాల్ని ధరించి మదనోత్తేజకరపు చూపులను బరపుతూ ప్రియుని సందర్శన సౌభాగ్యానికై చనుదెంచుతోంది:

ఆతరుణి ఉపగుప్తుని నయనాల్లో ఏవో పారలౌకిక శాంతికాంతులను వీక్షించింది. లజ్జాభారంతో వంచిన వదనాన్నుండి మందస్మితంతో అంది: ''మీదాసురాల్ని చీకటిలో చూడక మీసుకుమార దేహాన్ని గాయపఱిచా, నాకాలి తాకిడిచే; ఈకఠిన శయ్యపై నిదురించుట కోర్వలేనిది మీ దేహం. మాగృహానికొచ్చి సుఖతల్పంమీద శయనించి నన్ను మీ దాసినిగా స్వీకరించి కృతార్థురాలిని గావించండి''—సహజ మృదుమధురస్వరంతో శృంగారపు చూపులను బరపుతూ అంది వాసవదత్త. నిర్మలమనస్సుతో, 'తల్లీ సమయమేతెంచినపుడు నీఆహ్వాన మవసరములేకయే తప్పక నీచెంతకేతెంచుతా' అన్నాడు ఉపగుప్తుడు. ఆకాశంలో కారుమబ్బులావహించి పెనువాయువుతో గంభీరనినాదాలు వినవస్తున్నాయ్. బంగారుతీగలాంటి మెరుపుకాంతుల్లో దారిజూచుకొంటూ వెళ్ళిపోయింది, వాసవదత్త విచారవదనయై.

వసంతసంధ్యాకాలం. నగరంలోని నగారాలు ప్రతిధ్వనిస్తున్నాయ్. కోకిలల కూకూ నాదాలు నెమిళ్ళనాట్యాలు ఋతురాజుకు నూతనశోభ తెస్తున్నాయ్. నగరవాసులందరు ఆనందోత్సవానికై నగరి వెలుపలి రామసీమల కేతెంచారు. తూర్పున చంద్రోదయం; పశ్చిమాన్ని వివిధవర్ణాలతో సూర్యాస్తమయం. మందమారుతాలు పూల

తోటలోంచి రాజమందిరంలోకి షికారు చేస్తున్నాయ్. సన్యాసి ఉపగుప్తుడు నగర బాహ్యానికి వెళ్ళాడు. అది భగవన్నియుక్తమైన సంకేతరాత్రి కాబోలు కుళ్ళు కాలువలచే ఆవరింపబడ్డ పూరింటిలో వాసవదత్త నర్తకి, అతిలోకసుందరి రోగపీడితయై జీవచ్ఛవంగా పడుంది కటికినేలపై ఒంటరిగా. ఉపగుప్తుకు దగ్గరగాబోయి తనకమండలంలోని మంత్రోదకాన్ని ఆమెమీదచల్లాడు. మూల్గుతూనే కన్ను తెరచి "ప్రాణాన్ని బోసిన మీకు ధన్యవాదాలు...మీరెవరో...." 'నేను ఉపగుప్తుణ్ణి—వలపుపిలుపుగాదు' ఆర్తధ్వని విని వచ్చాను.' వాసవదత్తనయనా లశ్రుపూరితాలయ్యాయ్.

(రవీంద్రుని అనుసరించి)

# పళని దేవాలయం

శ్రీ కె. కె. మీనన్ బి.ఏ., బి.ఎల్. (మధుర దేవాలయాల సూపరింటెండెంట్)

నక్కీరల్ అనే తమిళకవి మధురలో ప్రసిద్ధిచెందిన 3వ సంగం కవుల కూటమికి సంబంధించిన వాడు. ఆయన క్రీ. శ. 1 వ శతాబ్ద ప్రాంతమున నివసించుచుండినవాడు. ఆయనయే 'తిరుమురుగప్పాడై' అను ప్రాచీన కావ్యము రచించిన మహాకవి. అందాయన ఇట్లు రచించి యున్నాడు. మోక్షసామ్రాజ్యము నేలదలచినవాడు, తిరుప్పరంకుంద్రం (మధురవద్ద) తిరుచెందూరు, తిరువేట్రింకుడి, (పళని) తిరువేరగ నూరు, కున్రుతోరడల్, పళముదిర్‌శోలై (అలగర్‌కోయిల్) అను దివ్యక్షేత్రములను దర్శించవలెను. ఈ కావ్యమును అతడు పట్టుప్పాట్టు అనే ఉద్గ్రంధమునకు అనుబంధముగ రచించి యున్నాడు. వ్రాసిన సంవిధానమును విలక్షణమైనది. ఒక రాక్షసుడు ఈ మహాకవిని ఒక గుహాంతరంలోపట్టి బంధించెనట. గొప్ప బలిదాన మొనర్చుటకై ఆ రాక్షసుడప్పటికే 999 మందిని బందీకృతుల గావించెను. అట్టి బంధనములోనుండి ఈతడీకావ్యం రచించగానే, భగవాన్ మురుగేశుడు ప్రత్యక్షమై, రాక్షసుని వధించి మహాకవిని ఆతనితోటి ఖైదీలను రక్షించెను. ఈ అనుబంధ కావ్యమును పఠించి నట్లైతే అట్టి శుభము కల్గుతుందని ఇప్పటికీ భక్తులు విశ్వసిస్తున్నారు. ఈ కవి పేర్కొన్న 7 కొండలలో — తిరుప్పరంకున్రం మధురకు 5 మైళ్ళున్నది, ఆ పర్వతంమీద అనేకమైన అద్భుతాలు జరిగినవి. శ్రీ సుబ్రహ్మణ్యస్వామివారు దేవసేనను పెండ్లాడడంకూడా వకటి. తిరుచెందూరు వద్దనే—శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడు సురపద్మను ధ్వంసం చేసినందులకై భక్తులు ప్రథమంగా పూజించినారు. పళనియందు శ్రీ సుబ్రహ్మణ్యుడు కుమారరూపాన ఇడుంబునకు ప్రత్యక్షమైనాడు. కుంభకోణమునకు 4 మైళ్లలో కృత్రిమ పర్వత దేవాలయమున్నది. దానిపేరు స్వామిమలై. ఇదియే ఆకవి పేర్కొన్న తిరువేరగం అంటారు. కున్రుతోరడల్ ఫలానా అని ఇంకా ఎవ్వరు నిర్దేశించలేదు. పళముదిర్‌శోలైనే అళగిరి పర్వతాలు అంటారు. ఇవి మధురకు 13 మైళ్లలో ఉన్నవి. ఈ సంచికలో పళనిని గూర్చియే వ్రాయదలచి యున్నాను. మిగత వానిలో కొన్నిటి విషయం పిదప సంచికలలో వ్రాస్తాను. తిరువావినంకుడినే—పళనివద్ద "సిత్తనవల్వు" అని కూడా అంటారు. ఏమైనా, పళనియందు శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవాలయములు పేరుగడించినవి. అతిదూరదేశంనుంచి కూడా చాలామందిభక్తులు వస్తూఉంటారు. అన్నికులాలవారిచే జాతులవారిచే స్వామి గొప్పగా కొలువబడు చున్నారు.

ఈ దేవాలయముయొక్క మూలము, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని కావడీపూజా విధానమున ఆరాధించు క్రమమునకు మూలము పరస్పరం సంబంధించి యున్నవని తోచుచున్నది. ఈ విషయమై స్థలపురాణంలో ఈ గాధ చెప్పబడియున్నది. సదాశివుడు కైలాసపర్వతపంక్తినుండి రెండు చిన్న పర్వతములను—శివగిరి, శక్తిగిరి — అనే వానిని తీసి అగస్త్య మునీంద్రునికిచ్చి — దక్షిణాపథానికి తీసుకొనివెళ్లి, — ఆ రెంటినీ జగదీశ్వరీ, జగదీశ్వరులనుగా పూజింపుమని ఆజ్ఞాపించెను. ఆ ముని ఆ రెండు పర్వతములను మోయజాలక తన శిష్యుడైన ఇడుంబునను మోసుకొని రమ్మనెను. వానికైనను ఆ పర్వతములను మోయుశక్తి కలుగుటకై కొన్ని మంత్రముల నుపదేశించి — దారి తెల్పెను. ఆ ఇడుంబను, అంతట, నా పర్వతములను మోయుటకై సౌకర్యార్థము అనంతవాసుకి తక్షకాది సర్పరాజములతో వానిని బ్రహ్మదండి కిరువంకలా కావడి కుండలవలె వ్రేలగట్టుకొని — ఆ కావడిని భుజముపై పెట్టుకొని దక్షిణానికి నడిచినాడు. పళని

చున్నది. బహుశా అతడు తన ఆశ్రమము నాపర్వతమున నిర్మించుకొని, తన శిష్యులకు ఆశ్రితులకు, ఔషధ సేవ గావించుచుండెను కాబోలు. ఆ పిదప ఆయన శిష్యుడొకడు, పుళిప్పాని వంశజుడు, ఆ దేవాలయములో ప్రార్థన చేయుచుండెను. క్రమముగా నాదేవాలయ మహిమాతిశయములు, అందలి ప్రార్థనాదికముల ఫలితములు_దేశదేశములకు వ్యాపించెను. మలబారు పాలించిన పెరుమాళ్ రాజులలో కడపటివాడైన సుప్రసిద్ధ చేరమాన్ పెరుమాళ్, 9 వ శతాబ్దము నాటివాడు. పైగాథ లతని చెవికి నెక్కెను. మలబారులో నేడమలునందున్న చాల ఆచారవ్యవహారములకు ఈ చేరమాన్ పెరుమాళ్ళే మూలమని చాలమంది అభిప్రాయము. నిజానికి ఆయనే నేటి కేరళమునకు సృష్టికర్త. అతని పాలనలో, కేరళదేశమున శాంతి సౌఖ్యములు సన్నగిల్లినవి మళయాళ శకము – "కొల్లవర్షము" – వారి పరిపాలనాంతమునుండి లెక్కింపబడుచున్నది. కేరళదేశ ప్రజలాయనను చాల భక్తిభావమున చూతురు. తమిళ వాఙ్మయమునకూడ ఆయన నొక శైవభక్తునిగా, చేరమాన్ పెరుమాళ్ నాయనార్, అని కీర్తింతురు. ఈ దేవాలయమునకు మూలమైన అర్ధమండపమును ఆయన కట్టించినాడట. గర్భగుడియందలి దక్షిణపు గోడపై అశ్వారోహణమొనర్చి యున్నట్లతని విగ్రహము చెక్కబడియున్నది. ఈ దేవాలయమున నైవేద్య దీపారాధనలు జరుపుటకై సుక్షేత్రముల వంటి భూములను దానమొనర్చెను బహుశా, ఇది వారికభిమానపాత్రుడైన రాజుయొక్క దేవాలయమగుటచేత కాబోలు, కేరళదేశమునుండి వేలాది భక్తులిచ్చటికి వచ్చుచుందురు. శ్రీ దండాయుధపాణికిన్ని కేరళదేశమంటే అభిమానమే. ఆయన మూర్తి పశ్చిమాభిముఖమై ఆ దేశమును చూచుచు నిరంతరము ఆ దేశమునకు సస్యాభివృద్ధియు, సకల శ్రేయోభివృద్ధియు నాశీర్వదించుచుండును.

మధుర నేలిన తెలుగునాయక రాజులు ఈ దేవాలయమును జీర్ణోద్ధారణ మొనర్చి, పెంపుచేసిరి.

ఈ సందర్భమున తిరుమలనాయకుని (1623-1659) ఆయన దండనాథుడు రామప్పయ్యను ప్రత్యేకముగా పేర్కొనదగును. రామప్పయ్య ఈ దేవాలయమును దర్శించి అష్టబంధన కుంభాభిషేకమును గావించెను. అంతవరకు దేవాలయమున పుళిప్పాని వంశజులే పూజారులుగా నుండిరి. ఈయన ఇచ్చిన దానపత్రమును చూడగా ఇట్లు తెలియుచున్నది. ఆ పూజారుల హస్తములనుండి తాను తీర్థ ప్రసాదముల స్వీకరింపజాలనని తెలిసి—దేవాలయములో పూజాపునస్కారములు చేయను సరస్వతీ బ్రాహ్మణు నొక్కరి నేర్పరచి, ఈ నియమించుటకు ఆపూర్వపూజారులు సమ్మతించునట్లు నిర్బంధించెను. కాని పుళిప్పాని వంశస్థులకు మాత్రము దేవాలయ ధర్మకర్తృత్వాధికారములు, బాధ్యతలు కొన్ని యొసంగెను. ఈ విధముగా నీ దేవాలయపు పూర్వ పూజారులను, పుళిప్పాని వంశస్థులను తొలిగించి, వారిస్థానే ఆదిశైవ శివాచారుల నేర్పాటు చేయుట కితడే కారకుడాయెను.

## దేవాలయ వర్ణనము

ఈ దేవాలయము కొడైక్కానాల్ పర్వత పంక్తితో చేరిన సుందర పర్వతాగ్రమున నున్నది. ఈ పర్వతము ఎత్తు 450 అ॥లు. పర్వతము క్రింద, చుట్టు ఒక మైలు కైవారమున గిరివీధియని, మంటపములు, సమాధులు, నందనవనములు మున్నగువానితో కూడి అందముగా నుండును. గిరిప్రదక్షిణము చాల పవిత్ర కృత్యముగా తలంపబడుచున్నది. (భక్తులు రోజుకొక్క ప్రదక్షిణముగా 45 రోజులు గావించినచో తమ కోర్కెలు సఫలమగునని నమ్మెదరు. గృ॥ సం.) గిరివీధినుండి రెండు మైళ్లలో షణ్ముగనది గలదు. అది చాల పావనమైన నది. ఆ షణ్ముగనది ఆరుపాయలైనది. అందొక్క పాయనుండి ఈ దేవుని అభిషేక తీర్థము తెచ్చెదరు. షణ్ముగనది స్నానఘట్టమున వినాయకుని దేవాలయము, కైలాసనాథుని దేవళము, నవగ్రహ, దక్షిణామూర్తుల ఆలయములు గలవు.

పర్వతపు క్రింది అంచున శ్రీ మీనాక్షి సుందరేశ్వర దేవాలయమును గలదు. కొండ చుట్టూరా క్రిందినుండి పైకి 659 రాతిమెట్లు చెక్కబడియున్నవి. భక్తులు వీనిని కష్టపడి యెక్కి స్వామిని దర్శింతురు. ఈ మెట్లు ఇటీవల కట్టినవే. మెట్లు ఎక్కువారి సౌకర్యార్థమై అక్కడక్కడ మెట్ల ప్రక్కన మండపములను నిర్మించియున్నారు. ఆ మండపములలో వినాయక దేవాలయమని, సుబ్రహ్మణ్య దేవాలయమని, కన్నిమర్ దేవళమని పలు దేవతల చిన్న చిన్న దేవళములు గలవు. దారి యంతటను విద్యుద్దీపము లమర్పబడి యున్నవి. రైలు స్టేషన్ సమీపించగనే, కాంతియుతమైన మెట్లు, సుందరముగ కన్పించి భక్తుల నాహ్వానించుచున్నట్లుండును. కొండ మధ్యభాగమున ఇడుంబన్ దేవాలయమున్నది. ఇచ్చట ఇడుంబన్ విగ్రహము మురుగేశుని పాదముల సాగిలి మ్రొక్కుచున్నట్లుండును. ఇక్కడనే యొక శివలింగమున్ను అగస్త్యుని మూర్తియుగలవు. పర్వతాగ్రప్రదేశము చౌకము. ఆ చౌకము చుట్టూ అందమైన నల్ల రాతి ప్రాకారము.

ఈ కొండ దేవళమునకుకూడా అన్నిటికివలెనే బహిప్రాకారము కలదు. ఆ లోపలనే ముఖ్య దైవమునకు, చిల్లర దేవుళ్లకు దేవాలయములున్నవి. ముఖ్యదేవాలయము శిల్పశాస్త్ర రీత్యా ఎన్నికగన్నది కాదు, మరి అందు శ్రీ రంగమండలి రంగనాథాలయములోవలె, లేక మధుర మీనాక్షి దేవాలయమున వలె, భక్తుల కద్భుతము గొల్పు చెక్కడపు రాతి విగ్రహములున్నూ లేవు.

ఇచ్చట శ్రీ మురుగేశుడు యౌవనరూపమున దండాయుధ పాణియై సమీపస్థులను, దూరస్థులను వేనకు వేలుగా, భక్తులను, యాత్రికులను ఆకర్షించుచుండును. కావడి అప్పనములే గాక, తలనీలా లిచ్చుటయు, ఇక్కడి మొక్కు బళ్లలో ముఖ్యాచారము. అందుచే నిచ్చట — క్షురకర్మ హక్కును వేలము వేయుటచే సాలీనా మిక్కిలిగా ఆదాయము వచ్చుచున్నది.

## ఇక్కడ జరిగే ఉత్సవాలు

ఇక్కడ జరిగే ముఖ్యమైన ఉత్సవాలు:—

(1) తైపూశం (జనవరి-ఫిబ్రవరి)
(2) పంగుణి ఉతరం (మార్చి-ఏప్రిల్)
(3) అగ్ని నక్షత్రం—(మే.)
(4) వైశాఖం (మే-జూన్)
(5) స్కాంద షష్టి (అక్టోబర్-నవంబర్)

శ్రీ దండాయుధపాణి స్వామికి 15 సం॥ల క్రిందట సుమారు లక్షరూపాయలు పెట్టి వెండి రథం చేయించారు. ఆ రథముపై శ్రీ స్వామివారిని జేంచేపు చేసి — తైనెలలో నగరదేవళం చుట్టునూ, పంగుణి నెలలో గిరివీధి చుట్టునూ ఊరేగింపు చేస్తారు.

## పరిపాలన - ఆదాయము

ఈ దేవాలయాన్ని హిందూ దేవాదాయ ధర్మాదాయముల బోర్డువారు నోటిఫైచేసి — తమ స్వంత పరిపాలన క్రిందికి తెచ్చుకొని నడుపుచున్నారు. ఈ దేవాలయానికి సాలీనా 3—4 లక్షల ఆదాయము వస్తుంది. ఇందులో విస్తారము హుండీ వసూళ్ల వల్లనూ, కానుకల వల్లనూ వచ్చుచున్నది.

(ఈ దేవుని మహిమాతిశయ మేమోగాని తురకలును వీరిని కొల్తురు. గృ॥సం॥)

---

## "మారాలి" ● ● ● ● "శేషు"

"భడవా! ఏమిటీ వెకవెకలాడుతూ ఆ రజిగాడితో అంతసేపూ మాటలేమిటీ?"

"అయినవాడితో ఆమాత్రం మాట్లాడితే అంతనుమానం దేనికండీ?"

"ఏడిశావు - నోరుముయ్యి. యిటువంటివి మాయింటా, వంటా లేవు. యింక యిలాంటి వేషాలు వేశావంటే ప్రాయశ్చిత్తంచేయించకుండా నీ ముఖం చూడను, తెల్సా!"

"మహా ప్రాయశ్చిత్తాలని అంత గట్టిగా కేకలేస్తున్నారువేమిటండీ! ఏబైయేళ్లు వంటికొచ్చి మీరా వెంకమ్మగారితో సరససల్లాపాలాడొచ్చు - స్వయానా తల్లి తమ్ముడైన మా రాజుతో కాస్త చనువుగా మాట్లాడితే మీరు నాకు ప్రాయశ్చిత్తం చేయిస్తారు. మీపాలు నెరిసినా మీరు చేసే అఘాయిత్యాల కంతుండదు. మళ్లీ చదివేవి పురాణాలు, చెప్పేవి ధర్మపన్నాలు - చేసేవి వితంతుస్పర్శలు. ఇలాంటి మీరు సభల్లో పండితులు, పూజ్యులు. యింతేగా మీ సంఘకట్టుబాట్లూ, నియమాలూ, ఏం?

మీరు యేనాడో చేసిన పూర్వపుణ్యఫలితంగా మీ మలిన యజ్ఞోపవీతాలు సబ్బుతో రుద్దడానికి, మీ చిక్కు శిఖల్ని నున్నగదువ్వి ముళ్లువేయడానికి, మీదుర్గంధపు అంగోస్త్రాల్ని ఆరెయ్యడానికి-నన్ను పయోగించుకోటానికి బానిసగా సమర్పించారు - నాతలిదండ్రులు-కదూ! యివే మీరూ, మీమతాలుచెప్పే మహా పతివ్రతామతల్లుల లక్షణాలు. అవి ఆ పాత రాతియుగాల్లో చెల్లేయి. అటువంటి పతివ్రతాశిరోమణుల్లా గుండాలనే వాంఛలు పెట్టుకొని మీరు ఆజ్ఞాపించే ఆజ్ఞలు శిరసావహించి, నిర్వర్తించి, మీరుపెట్టే కఠిన హింసల్ని అనుభవించి అమాయకంగా గడిచేరోజులు పోయాయి. మీరు ప్రాయశ్చిత్తం, వెలి అని బెదిరిస్తే బెదిరేదినాలు పోయాయి. మీసంఘాన్నీ, మిమ్మల్నీ విమర్శించిపోసే యీ ఆధునికయుగంలో వాటికి తావులేదు.

"అయ్యో కర్మమా! నవ్వుతూ మాట్లాడేవేమే అంటే యింత చదువెందుకే సుబ్బా!"

"గుమ్మంలోకొచ్చినవాళ్లతో నవ్వుతూ కాకపోతే ఏడుస్తూ మాట్లాడమన్నారా? యింతకూ మిమ్మల్ననవలసినదేముందీ! మీరుపుట్టినట్టే రక్తమాంసాలతో, అభిరుచుల్తో, ఆశల్తోనే నేనుపుట్టాను. మీతలిదండ్రులు పెంచినట్టుగానే అతిగారాబంగా పెంచారునన్నూ - యింతకూ మీరు మగవారు, నేను స్త్రీని. అయినంతమాత్రాన మీరు యిన్ని పెళ్లిళ్లుచేసుకొన్నా తనివితీరక ఆ వితంతువుతో సరసాలాడినా సమ్మతమే మీ సంఘానికి - కాని స్త్రీ తన మేనమామైన పురుషునితో నిష్కల్మషహృదయంతో ఏమాత్రం చనువుగా మాట్లాడితే ప్రాయిశ్చిత్తమైనా చేయించాలి - వెలైనా వెయ్యాలి. యింతేగా మీసనాతన ధర్మాలు: అందుకనే అన్నిమతాలకంటే ఎంతోవెనకుండి ఐకమత్యమనేదాని కవకాశమివ్వక అతి హేయంగా చూడబడుతోంది.

చదువుకొన్న నాలాటియువతులికి మీబోటి ముసలిమగల్ని; పెండ్లంటే ఏమిటో తెలియక పట్టున పదేళ్లైనాలిండని నిరక్షరకుక్షుల్ని, విజ్ఞానవంతులైన యువకుల్ని వెదకడంలో తలిదండ్రుల దృక్పథాలు పూర్తిగా మారాలి. అంతవరకు "సంసారం సాగరం దుఃఖం" అన్న సామెత సరిగా వర్తిస్తుం దీహిందూ సంఘానికి. సామెతల్ని సమర్థించడానికిమాత్రమే ఉపకరిస్తాయి మీకట్టుబాట్లు.

"మొన్న మాతాతగారింట్లో పెండ్లికివెళ్తే మనదాంపత్యం కళ్లకట్టినట్లయింది. మూడిరవైలునిండిన ముచ్చలైన ముసలివరుడు, ఎనిమిదేళ్లు ఎంచి లెక్కపెట్టినాలేని వధువువేలు, పానకపుబిందెలోని ఉంగరం వెదుకుతూ తనకున్న శృంగారకళాప్రవేశాన్ని తెలియబరచేఉద్దేశంతో, గోటితోనొక్కితే "అమ్మా! తాత వేలుంరక్కుతున్నాడే" అని ఏడవడంప్రారంభించింది. ఇలాంటి పెళ్లిళ్లు ఎందుకీ హిందూమతంలో?- తనయావజ్జీవితం త్యాగంచేసుకొని పోయినమగనిపేరిట స్మారకచిహ్నంగా బౌద్ధస్థూపంలా యీప్రపంచంలో.

"మాసుబ్బు ఎంతధాటీగా మాట్లాడిందీ! చాలాసంతోషం. వేన్నీళ్లుతోలుపు. భగవాన్లుగారు స్నానానికివస్తున్నారు."

"అంతే - ఏంలాభం? ఎంతమంది ఎంత ఎలుగెత్తి ఎంత కల్లోలపరచినా మీ సనాతనులు మీ ధర్మాల్ని, సంఘనియమాల్ని మార్చుకోరు. ఎప్పుడో ఎవరోవ్రాసిన పురాతనపువ్రాతలు చిరస్థాయిగా యుండిపోవల్సిందే! వెళ్లి వన్నీళ్లుచేయండి కబుర్లుచెప్పక-"



# చ ద ర ం గ ము

మును మండోదరి రామరావణులు నాభూజానికై పోరుచోఁ
దన నాథుండగు పంక్తికంధరున కానందమ్ము సంధిల్లఁగా
వినియోగించి స్వకీయ కౌశలముఁ దా భేదప్రధానంబుగా
రణవిజ్ఞాన మొనర్పఁగూర్చె చతురంగంబొప్పఁ బూర్వమ్మునన్.

చతురంగ మ్మను నామము
చతురంగమ ! నీకె తగును ; జగమందునన్,
చతురమగు నంగు బలమును
చతురతఁ గలదాన వౌట చరితార్థంబే.

---




439. ఎల్లపాములు తలలెత్తితే యెలికపాముకూడ తల యెత్తిందట
440. ఎగిరివూస్తే ముఖానికేపడుతుంది.
441. ఎంతవుచ్చిన మిరియాలు జొన్నల పాటివి కాకమానవు.
442. ఏనుగుదాహమునకు చూరునీళ్లా?
443. ఐశ్వర్యమున కంతులేదు.
444. ఒకరిద్దరిని చంపినగాని వైద్యుడుగాడు.
445. తనకులేదని యేడిస్తే ఒక కన్నుపోయింది. ఒకరి కున్నదని యేడిస్తే రెండుకనులు పోయినవట.
446. ఓకారమురానివాడు వడ్లుగుణించినట్లు.
447. ఔషధానికి అపత్యానికిచెల్లు,రోగముపైసబ్బా.
448. అందిన తీపి, అందకున్న పుల్లన.
449. అంటేరు వచ్చింది తాతాఅంటే కోలబుర్ర చేతిలోవున్నది కోడలా అన్నదట.
450. కట్టెవంక పొయ్యి తీర్చును.
451. కడుపు కూటికేడిస్తే, కొప్పు పూలకేడ్చును.
452. కాకియై కలకాలము బ్రతికెడికన్న హంసయై ఆర్నెల్లు బ్రతికిన చాలదా?
453. కాశీకెళ్లిన కర్మముతప్పలేదు.
454. కాశీకెళ్ళి గాడిదగుడ్డు తెచ్చినట్లు
455. కామయ్యదగ్గఱ కయ్యికుయ్యి పనికిరాదు.
456. కాగలకార్యమును గంధర్వులే తీర్చిరట.
457. కూసేగాడిద వెళ్లి మేసేగాడిదను చెరిపినట్లు.
458. కూతురు కూటికియేడిస్తే, అవ్వ ఇంకెందుకో యేడ్చిందట.
459. క్రొత్తయొక వింత, పాత వకరోత.
460. కంచుమ్రోగునట్లు కనకంబుమ్రోగునా?
461. గడించేవాడు ఒకడైతే గుణించేవాడు మరి యొకడు.
462. గుండీదొరికిందని కోటుకుట్టమన్నాడట.
463. గోడలకు చెవులున్నాయి. వాసాలకు కండ్లున్నాయి.
464. గోడమీద పిల్లివాటం
465. గొడ్రాలుకేమి తెలియునురా బిడ్డనొప్పులు
466. చేతగానివానికి శౌర్యంజాస్తి.
467. చిన్నయింట్లో పెద్దకాపురము చేయమన్నార
468. చెప్పితే మానంపోతుంది, చెప్పకుంటే ప్రాణముపోతుంది.
469. చేసేవి మాఘస్నానాలు, దూరేవి దొమ్మ గుడిసెలు.
470. చదవవేస్తే ఉన్నమతిపోయినదట.
471. చదువకముందు కాకరకాయ అంటున్నది. చదువవేసిన తర్వాత కీకరకాయ అన్నట్లు.
472 చేలోప్రత్తి చేలోనుండగానే, నాకు అ మూళ్ళు, నీకు మూడుమూళ్ళు అన్నాడట.
473. చంకదుడ్డు శరణారి.
474. చద్దితింటావా, చక్కిలాలు తింటావా అంటే చక్కిలాలుతింటాను, చద్దితింటాను, అయ్యా వేధించుకొనీ తింటాను అన్నాడట.
475. చీకటి కొన్నాళ్లు వెన్నెలకొన్నాళ్లు.
476. తెలివతక్కువవాని పెండ్లి తెల్లవార్లు అయినట్లు
477. తలప్రాణము తోకకువచ్చింది.
478. దొంగదూరిన ఆర్నెల్లకు కుక్కమొరిగినట్లు.
479. దమ్మిడీపెండ్లికి రూపాయిబాణసంచా.
480 దరిద్రుడిపెండ్లికి వడగండ్లవాన.
481. దండుగలో పండుగ.
482. దిగితేగాని లోతుతెలియదు.
483. దిక్కులేనివారికి దేముడేదిక్కు.
484. నేనుచెప్పినట్లు చెయ్యిగాని, నేనుచేసినట్లు చేయవద్దు.
485. నాది సుకుమారప్రాణం మెత్తనిచెప్పుతో కొట్టమన్నట్టు.
486. నారు వేసిన వాడు నీరుపోయడా?
487. నిద్రబోయినవానిని లేపవచ్చునుగాని, మేల్కొనినవానిని లేపలేము.
488. నవ్వచెప్పువాడు చెడచెప్పును, ఏద్వచెప్పువాడు బ్రతుకజెప్పును.

# గృహలక్ష్మి ఏజంట్లు:



గుంటూరు: వెల్కం & కో.
చిత్తూరు. వి. చెన్నకేశవులు నాయుడు.
కర్నూలు: బాలసరస్వతి బుక్ డిపో.
బెజవాడ: మాడరన్ న్యూసు ఏజన్సి.
కాకినాడ: వి. సూర్యనారాయణ
అనంతపురము: వై. సాంబయ్య.
భద్రాచలం: టి. వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం: సి. హెచ్. బాపనయ్య.
నర్సాపూరు: వై. సుందర్రామయ్య.
కావలి: జి. రంగయ్య.
మారుటేరు: వి. వి. సుబ్బారావు
గుడివాడ: యం. రామమూర్తి పంట్.
పిఠాపురము: యం. సూకరాజు.
కళ్యాణదుర్గం: కె. మల్లప్ప.
నిడదవోలు: కె. సి. సి. అయ్యర్.
మచిలీపట్నము: టి. బి. నారాయణసింగ్.
ఏలూరు: నేషనలు బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజన్సీస్.
తుని: కోడూరు సూకరాజు.
బరంపురం : కె.వి.రంగారావు.
విశాఖపట్నం: కె. సుందరేశ్వర్రావు.
కనిగిరి: కె. యస్. శాస్త్రి
పర్లాకిమిడి: బి. యన్. మూర్తి.
ఇచ్ఛాపురం: కె. గంగయ్య
బళ్ళారి: యస్. గురునాథ్
అనకాపల్లి: పి. వీరునాయుడు,
విజయనగరము : పి. నారాయణప్పడు.

ఆకీడు: వి. లక్ష్మీనారాయణ
భీమవరం: యన్. సూర్యనారాయణ.
పొన్నూరు: చాదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యన్. రాధాకృష్ణయ్య
అంబాజీపేట: పి. రామమూర్తి.
చికాకోలు: బి. యన్. మూర్తి.
వసంతవాడ: యస్. కె. శర్మ.
ఖర్గపూరు: యస్. వి. నాయుడు.
పార్వతీపురము: ఎ. వి. వి. యన్. మూర్తి
తిమ్మనచర్ల: రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు: సిటి న్యూస్ ఏజన్సి.
చల్లపల్లి: బి. ఆంజనేయులు.
జగత్యాల: కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: నేషనలుస్టోర్సు.
ఎలమంచిలి: కె దేముళ్ళు.
బాపట్ల: యల్. వి. మనోహరరావు.
నర్సీపట్నము: సి. రామం.
జంషెడ్పూర్: యం. శ్రీరాములు.
తాడేపల్లిగూడెం: జి. సూర్యరావు.
మహబూబ్ నగర్. ముత్యాలు & సన్సు.
వేలూరు: ఎ. వెంకటశాస్త్రిగారు.
హైదరాబాద్ : నవ్యాంధ్రా ఏజన్సీస్.
కదిరి: జి. సి. కోదండరామయ్య.
గోకవరం: వి. వి గోపాల్ రావు.
పామర్రు: జి. లక్ష్మయ్య.
ఛత్రపురం : వి. వి. రంగాచారి
డోర్నకల్లు : కె. జె. జి. సుందరం.
చోడవరం : పి. విశ్వేశ్వర్రావు.

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

 ఇతరచోట్లకు ఏజంట్లు కావలయును, డిపాజిటుతో దరఖాస్తుపంపుకొనుడు.

# లోకవార్తలు

ఇకపై భారత యూనియన్ వారి కరెన్సీనోట్లమీద ఇంగ్లాండు రాజుగారిబొమ్మ ఉండదు. అశోక ధర్మ స్తంభము నచ్చువేస్తున్నారు.

*　　*　　*

రామయ్యా నాడారు వెనకయుద్ధంలో కంట్రాక్టుపొంది ప్రభుత్వానికి ఉల్లిపాయలు సప్లైచేశాడు. ఆ బాపతు రు 60000 లు అతనికి రావాలట. ఆ రూపాయలతనికి చెందకుండా అధికారు లడ్డుపెట్టుచున్నారు. అని అతడు 29 రోజులు ఉపవాసంచేశాడు. మంత్రి మాధవమీనన్ గారు కనుక్కుంటాను అన్న తర్వాత నాడారు ఆయనగదిలోనే గ్లాసెడుమజ్జిగ త్రాగి ఉపవాసవ్రతాని కుద్వాసన చెప్పినాడు.

*　　*　　*

ఫిరదౌషి అనే సుప్రసిద్ధ పారసీక కవి క్రీ. శ 932-1020 సం॥ల మధ్యయుండినవాడు. సుల్తాన్ ఘజనీ మహమ్మద్ ఆస్థానకవి. ఇతడు షానమా అనే కావ్యమును 30సం॥లు వ్రాసినాడు. ఈగీతములు 120000 పంక్తులు. దీనినతడు 587 పుటలలో వ్రాసినాడు. ఇందుకై చీనాపట్టుకాగితము నుపయోగించినాడు. ఈ కావ్యము యొక్క పుటలు రంగులతో మిళితమొనర్పబడి బంగారునీరుపోసిన వివిధచిత్రలేఖనములతో అందమైయున్నవి. దానికొన్నో నకళ్లుతయారైనవి. అందొకటి లండన్‌లో 1040 పౌనులకు అమ్మబడినది.

*　　*　　*

పాశ్చాత్యస్త్రీలు మనవారి చీరల అందం కనుక్కున్నారు; మోజుపడి ధరిస్తున్నారు. మనదేశంలో వివిధ ప్రాంతములవారు చీరసింగారించుకునే వైఖరులు అమెరికాలో ప్రదర్శింపపడ్డాయి. అక్కడిభారత యూనియన్ రాయబారిభార్య శ్రీమతి రామరావుసతిగారే దీనినేర్పాటుచేశారు. వారిసాయంసమయపు గౌనుమీద అందంగా చీరనెలా చుట్టబెట్టుకోవచ్చునో ఆమెప్రదర్శించినదట.

*　　*　　*

బీహారములో శాసనసభ ఈమాసారంభంలో ఆదాయవ్యయపట్టిక చర్చింప సమావేశమైనది. సభా వ్యవహారమంతా హిందీభాషలోనే జరిగినది.

*　　*　　*

మదరాసులో కర్నాటకసంగీత విశ్వవిద్యాలయం ఏర్పాటుచేయవలయునని యూనియన్ ప్రభుత్వము సంకల్పించి అందుకుగాను యోచించను సంగీతకళాప్రియులైనవారితో ఒకకమిటీ ఏర్పాటుచేసినారు. ఆకమిటీసభ్యులలో కొందరు: శ్రీయుతులు పి. వి. రాజమన్నారు, టైగర్ వరదాచారి, ప్రొ. సాంబమూర్తి, కే. శ్రీనివాసన్, యస్. వెంకటేశ్వరన్, టి. కే. చితంబరనాధ మొదలియార్, కే. వి. కృష్ణస్వామిఅయ్యంగార్లు.

*　　*　　*

నైరోబీయందు 110 సం॥ల వృద్ధురాలు శ్రీమతి భోలీసతీ ఈ మాసారంభంలో కీర్తిశేషురాలైనది.






గాంధీ మహాత్ముడు హత్యగావింపబడి ఈ 30-1-49 నాటికి సంవత్సరమైనది. వారి దివ్య సూక్తులు ఒకటి రెండు ఇందు పొందుపరచెదము:—

ఒక ప్రజ ఎన్నో తప్పులుచేస్తూ దిద్దుకొంటూ క్రమంగా ఉత్తమప్రభుత్వము నేర్పరచుకోగలదనే మాట నేనూహింపగలను. అంతేగాని బయట వారెవరో తమ నెత్తిన రుద్దిన ప్రభుత్వంద్వారా తమ్ముతాము సరిగా పరిపాలించుకోగలరనేది నేనూహింపజాలను. జెముడు కాకి నెమలి ఈకెలు ఎరువు తెచ్చుకొని తోకలో గుచ్చుకుంటే మాత్రం-నెమలి నడకలు నడువగలదా?

♦ ♦ ♦

అసహనం అలవాటైతే, సత్యానికి దూరమవుతాము......

♦ ♦ ♦

నన్ను తలచి భారతదేశం నిరంతరము శాంతికోరునదై యుంటుందనీ, తద్వారా జాతివర్ణవివక్షత లేకుండా ప్రపంచమంతటా అందరూ నిజమైనశాంతి సౌభ్రాతృత్వాలనే తగు విధానంగా అవలంబిస్తారనీ- ఆశిస్తూ నేను కృషి చేస్తున్నాను.

♦ ♦ ♦

నేచేసిన అనేక పాపములను బహిరంగంగా స్పష్టంగా చెప్పుకున్నాను, కాని వాని భారం నే మోయడంలేదు. నేను భగవంతుని వద్దకు సాగిపోతున్నాను; నాకు భయమెందుకు?

♦ ♦ ♦

భగవంతుని దయవల్ల నాకనేకమంది మిత్రులు, అనుచరులు. నేను చచ్చిపోతే, వారీ దేశీయ కార్యాన్ని విడువక సాగిస్తారనే విశ్వాసముతో చచ్చిపోతాను. దేశసేవ అంటే మానవసేవే.

మహాత్మాగాంధీని గూర్చి ఇతరులు చెప్పిన మాటలు:—

మహాత్మ గాంధీ జీవితమంతా త్యాగానికి మారుపేరు.

—టాగూర్.

గాంధీ. వీరులు, ఆత్మ త్యాగులు అయిన వారి వంశలో పుట్టాడు అనడానికి సందేహంలేదు. అంతే కాదు; తన చుట్టూ ఉండే సామాన్య మానవులనుకూడా వీరులు, ఆత్మ త్యాగులుగాచేసే దివ్యశక్తిన్ని ఆయనకున్నది.

—గోఖలే

మహాత్ముని ఆత్మ, క్రీస్తు దేవుని ఆత్మయే.

—జే. హెచ్. హోమ్స్

♦ ♦ ♦

పూర్వకాలమందు బుద్ధునివలెనే ఆయన-నిర్భాగ్యుల కుటీరముల ఎదుట, వారివలెనే పేలికల ధరించి నిలిచినాడు. వారితో వారి భాషలో మాట్లాడినాడు. కేవలం పుస్తకములనుండి శ్లోకములుగాగాక - ఈ రూపమున సత్యము మూర్తీభవించి యున్నది. ఈ కారణముచే "మహాత్ముడు" అనేదే ఆయన నిజనామధేయము.

—టాగూర్

మహాత్ముని జీవితము మనకు నేర్పే పాఠము నేర్చుటకు సులభమైనది కాదు.

—హర్ విలాస్ శర్దా

---

# సంపాదకీయములు

## కర్నాటక సంగీత విశ్వ విద్యాలయము.

ప్రభుత్వమువారు కర్నాటక సంగీత విశ్వ విద్యాలయమును మద్రాసులో ఏర్పరచడానికి నిర్ణయించుకోవడం మెచ్చదగిన విషయం. అందుకుగాను మరొక కమిటీ నేర్పాటు చేశారు. వారంతా సంగీత కళావేత్తలు, నిపుణులు. అయితే సంగీతం ముఖ్యంగా స్త్రీ విద్య, స్త్రీయే కళామూర్తి. కనీసం వారికి సమాన స్థానమైనా యిస్తారుగదా పురుషులు! మరి ఈ సంఘమునందు ఒక్క స్త్రీనైనా నియమించలేదేలనో? విద్యాసుందరి గానకళావిశారద బెంగుళూరి నాగరత్నంగారున్నారు. విన్నవారినంతా మెప్పించ గల్గిన శ్రీమతి యమ్. యస్. సుబ్బలక్ష్మి అమ్మాళ్ గారున్నారు. మేము స్త్రీలకూ ప్రాతినిధ్యముండవలెనని దేబెరించడంలేదు. సంగీత కళకు విశ్వ విద్యాలయం ఏర్పాటుచేసే సంఘము నియమించేటప్పుడు తగు సలహాలివ్వను ఆ కళలో పేర్గాంచిన స్త్రీలుకూడా ఉన్నారు అనే స్పృహ ఈ ప్రభుత్వానికి ఏల లేకపోయెను అనే మేము ప్రశ్నిస్తున్నాము.

## గాంధీ సాంవత్సరికములు

గాంధీజీ హత్యగావింపబడి ఈ 30-1-49 నాటికి, సం|| ము. దేశమంతటా, ప్రపంచంలో పలు స్థలాలలో ఆయన సాంవత్సరికములు అర్హరీతిని జరిగినవి. అయితే శ్రాద్ధములు జరిపినంత శ్రద్ధతో, దేశీయులైనా. ఆయన ఆదర్శములను ఆచరిస్తే - దేశానికి పురోభివృద్ధిగలదు అని మా హెచ్చరిక.

## హిందూ కోడ్డు సవరణ బిల్లుమీద రిపోర్టు

హిందూకోడ్డు సవరణబిల్లుమీద ఉపసంఘంవారి రిపోర్టు ప్రచురమైంది. అందు స్త్రీలుకోరిన కొన్ని హక్కులొసంగినా, వారాశించినంత తెంపుకన్పించదు. భారత యూనియన్ శాసనసభవారు దానిని చర్చించేలోపల దానిపై తమ అభిప్రాయములను స్త్రీలు పురుషులు వారికందచేయదగును. క్రొత్త రాజ్యాంగచట్టం అమలులోకొచ్చేదాకా దీని నాపియుంచాలని కొందరి అభిప్రాయము. దీనిని చర్చించేటంత హక్కు ఈ సభకులేదని వారి వాదం. మిగత అన్నిటిని చర్చించి చట్టములుచేయడాకి ఉన్నహక్కు దీనికి ఎట్లాలేకపోతుందో? ఏమీలేదు - 'దుర్దినందూరంగానీ' అనే యోచన. సాంఘికముల తీవ్రవాదులగు యూనియన్ ప్రధానిగారు తప్పక దీనినిప్పుడే చర్చకు తేవలయునని మా కోరిక.

## రత్నాభరణముల విశేషము

సుప్రసిద్ధ శాస్త్రపరిశోధకులు సర్. సి. వి. రామన్ గారు 'రత్నములు వెల్తురు వెదజల్లును' అని తమ పరిశోధనలవల్ల కనుగొన్నారు. అందుచేతనే మన పూర్వులు సౌభాగ్యవతికి రత్నాభరణములు ధరించుట శోభస్కరమన్నారు. ఆ ఆభరణములను, అవయవాంగముల కొనల ధరించుట ఆచారమైనది. తల, ముక్కు, చెవి, చేయి మొదలైన ఆయాతలముల వరుసగా పాపటబొట్టు, అడ్డబాస బేసరులు, కమ్మలు, కంకణములు మున్నగాగలవి ధరించి - ఏ యింట వెల్గు వెదజల్లుతూ గృహలక్ష్మి నడయాడునో ఆ ఇల్లు లక్ష్మీనిలయముగాక వేరగునా?

---








## జ్యోతిస్సాహితి

ఇది జ్యోతిశ్శాస్త్రమును వెలువరించు మాసపత్రిక. జ్యోతిశ్శాస్త్రము వేదములయొక్క షడంగములలోనొక్కటి. అట్టి ఉత్తమశాస్త్రమునకై పుట్టిన ఈ పత్రికకు శ్రీ వేమూరి దక్షిణామూర్తిగారు సంపాదకులు. మానవునికి భవిష్యత్తునుగూర్చిన ఆత్రత మెంతవరకుండునో అంతవరకు జ్యోతిశ్శాస్త్రమున కాయువు, నవసరమునుండును. అయితే ఈ శాస్త్రము బహుక్లిష్టమైన గణితాధారమనియు, దీనికి పార్వతి శాపమున్నదనియు పాఠకులు తెలిసి దీని నాదరించుచో వారికి శ్రేయస్సు; పత్రికకు శ్రేయస్సు ప్రతినెల 1 వ తేది వెలువడును. సాలుచందా రు 9-0-0. విడిప్రతిక రు 0-12-0 లు.

## మాతృహృదయము

శ్రీమతి దొప్పలపూడి అనసూయాదేవిగారు రచియించిన ఖండకావ్యసంపుటమిది. ఆమెసోదరులు సీతారామమూర్తి కవిగారు. ఈయన 'అభినవతిక్కన' బిరుదాంకుడట. మేమెరిగినంతలో నెల్లూరివారు మా మిత్రులు శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి కొక్కరికే అట్టి బిరుదుగలదు. అయినను ఆ బిరుదేమి వారి కాణాచియా? అనసూయాదేవిఅన్నగారును అట్టి బిరుదు తొడుగతగినవారనియే మాయూహ. కాకున్న టాటోటు కవుల, కనకాభిషేకమనకైన—కట్టుమంచివారివంటి సంస్కారులు అధ్యక్షవహించి ఆశీర్వదింతురా? బహుశా వారే ఇచ్చిరేమో ఈ బిరుదు శ్రీ సీ. రా. మూర్తికవిగారికి. అవును: అట్టి బిరుదు ప్రదానమొనర్ప, వారిగురువర్యులగు శ్రీ వేదము వేంకట్రాయశాస్త్రిగారికే చెల్లును; పిదప వారి శిష్యులగు రెడ్డిగారికేచెల్లును. ఇట్టి అభినవతిక్కన నన్నగా, గురువుగా మన్నించుటలో తృప్తినందక - ఈ చెల్లి - కనకాభిషేక మహోత్సవసమయాన తన కవితాకన్యకా దానమొనర్చి - అల్లునింజేసుకొన్నది. నైజమే కదా - విద్యావంతుని, కవితానిపుణుని, కనకముగలవానిని అల్లునిగావించుకొనుట. శ్రీ అనసూయాదేవిగారి కవిత్వము అభినవతిక్కనసోదరికే, శిష్యకు తగినయుదాత్త శైలిలోనున్నది. పదలాలిత్యమీమె సొమ్ముగానున్నది. వ్రాసినది వనిత, విషయము మాతృహృదయము. ఇక మార్దవము చెప్పనేల? బాలికాపాఠశాలల యందిది పఠనీయ గ్రంథముగా నుంచదగినది. వెల రు 0-8-0. వలయువారు శ్రీమతి అనసూయాదేవిగారికే రేటూరు. P. o (via) బాపట్ల అని వ్రాయుడు.

## రహస్యం

ఇది కడపనుండి వెలువడుచున్న సచిత్ర మాసపత్రిక. ఈ పేరే చాలామందికి వింతగొల్పవచ్చు. కాని సంపాదకులా పేరు వరించిరి. 'పేరులోనేమియున్న' దనికదా ఆర్యోక్తి! అన్ని మాసపత్రికలలో వలెనే దీనిలోను కొన్ని కాముకకార్యకలాపములు తెల్పే కథలున్నాయి. శ్రీ కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారు "మనభాష" అనే వ్యాసమొకటి వ్రాశారు, అందు 'రాయలసీమతెనుగ'ని ప్రత్యేకంగా ప్రశంసించారు. బాగుంది. - "వెలితిచూపులు" అనే కథలోగల-'పిట్టరాజకామిని' 'ఊరపిచ్చుక స్థావరాలు' 'సమీపఇంట్లోకి' 'స్నేహనవ్వులు' 'కన్నెకామణి' 'నవయౌవనారాణి' - ఇత్యాది ప్రయోగములలో శ్రీ

శర్మగారి పరీక్ష కాగ 'రాయలసీమ తెనుఁగు' గాన్పించదు. అయినను "లోకో భిన్నరుచిః" అన్నారు. సాలు చందా రు 4-0-0. వలయువారు, పత్రికాకార్యాలయానికి కడపవ్రాయండి.

## జీ వ కా రు ణ్య క థ లు; జీ వ కా రు ణ్య ము

ఈ రెండు కథలపుస్తకములు. వాచకములపద్ధతిని వ్రాయబడినవి. ఇందు ముందుదానికి కీ|| శే|| శ్రీమాన్ వి. యస్. శ్రీనివాసశాస్త్రిగారు, రెండవదానికి డా. సుబ్బరాయన్ గార్లు తొలిపలుకువ్రాసియున్నారు. పిల్లలకు జంతువులయందు దయాదాక్షిణ్యములు చిన్నతనముననే కలుగుటకివి చక్కగ ఉపకరించును. దీనిని రచించిన శ్రీ రావుసాహేబ్ యన్. వి. రంగస్వామిఅయ్యంగారు మద్రాసు జీవకారుణ్యసంఘమునకు అసిస్టెంటు కార్యదర్శిగానున్నవారు. బహుశా వీరు తమిళమునగాని ఆంగ్లమునగాని వ్రాసిన పాఠములను తెలుగు మున్నగు ఇతరభాషలలోనికి తర్జుమాచేసియుందురు. వీనిలో మొదటిది రెండవకూర్పున్నూ, రెండవది మూడవకూర్పున్నూ అయినవనగా వీనియెడ పాఠకుల ఆదరణ తెల్పుచున్నది. ఇందు మొదటిది రు 0-10-3, రెండవది రు 0-6-6 లు. వలయువారు గ్రంథకర్తపేర వేపేరి, మద్రాసు అని వ్రాయుడు.

## సు వ ర్ణాం జ లి

ఇదియు నొక ఖండకావ్యసంపుటి. మాతృహృదయమందు ప్రస్తావనవచ్చిన అభినవతిక్కన బిరుదాంకులు శ్రీ సీతారామమూర్తికవిగారి శిష్యులు - శ్రీ కన్నెగంటి - వీరభద్రాచార్యులను పల్నాటి సోదరకవులు - అభినవతిక్కనకు నిడుబ్రోలునందు పౌరులు కనకాభిషేక మహోత్సవమొనర్పగా వారికుద్దిగా నీ'సువర్ణాంజలి' నర్పించిరి. వైరికవులు, సువర్ణాభిషేకమునకన్న సువర్ణాంజలులకే యుప్పొంగుదురు. మన సోదరకవులు - తొలుదొల్తగా రచించిన 'అంజలి' లో అభినవతిక్కన కవిత్వతత్వమును వర్ణించుపట్ల వ్రాసిన విధాన-"కమ్మని తేనెలోఁ బసిడిగంటమః ముంచి స్రవించుచున్న కాలమ్మున వ్రాసి" యున్నచో, "మధురకావ్యములన్" "త్రిశతీయములు" "గ్రమ్మ"నా? ఆ తాటియాకులకు చీమలుపట్టునుగాని! ఛలోక్తికిట్లంటిమిగాని - శిష్యుల కవితనుబట్టి గురువుగారి అంతరమూహింతుము; అది యున్నతశ్రేణికి చెందినదే యని మా అభిప్రాయము. వెల రూ. 0-12-0 లు. వలయువారు గ్రంథకర్తలపేర దాచేపల్లి, గుంటూరుజిల్లా అని వ్రాయుడు.

## శ్రీ సర్వధారినామ సం॥ర మాఘ,-ఫాల్గుణ మాసములు.

ఫిబ్రవరి 1949-వ సం॥

| | | |
|---|---|---|
| 16 | బు | బ. త 5-16 ఉపరిచవితి 53-31 ధ 5.16 సంకష్టహరణ గణేశవ్రతం. |
| 17 | గు | పం 53.4 హ 1.5 చిత్త 56-19 ది 19-5. |
| 18 | శు | ష 48-3 స్వా 53-18. |
| 19 | శ | స 43-33 వి 50-41 |
| 20 | ఆ | అ 40-1 అను 48-47 త్యా 40-1 జానకీజయంతి. |
| 21 | సో | న 37-16 జ్యే 48-1 ది 2.1. |
| 22 | మం | ద 35-47 మూ 48-18. దివి 2-1. |
| 23 | బు | ఏ 35-37 పూషా 49-50 సర్వేషాంవిజయైకాదశీ. |
| 24 | గు | ద్వా 36-49 ఉషా 53-0 ది 10.49 |
| 25 | శు | త్ర 38-53 శ్ర 56-29 మహాశివరాత్రిః జాగరణోత్సవం శ్రీశైలమహానంది, [పాణికేశ్వర ఓంకారేశ్వర విరూపాక్షేశ్వరాది దివ్యలింగ మహాభిషేకోత్సవం. |
| 26 | శ | చతు 42-20 ధ 60-0 దివి 7-8. |
| 27 | ఆ | అమా ● 46-51 ధ 1-50 అమాతర్పణం పిండపితృయజ్ఞః ది 21. 32. |

### ఫాల్గుణ మాసము.

మార్చి 49

| | | |
|---|---|---|
| 28 | సో | శు_పా 51-52 శత 7-38 శిశిరలక్ష్మీవ్రతం. |
| 1 | మం | వి. 57-18 పూభా 14-6 సత్యబోధతీర్థ పుణ్యదినం. |
| 2 | బు | త 60-0 ఉభా 20-42 త్రిదినస్పృక్. |
| 3 | గు | త 2-37 రే 27-3. |
| 4 | శు | చ 7-1 అశ్వ 32-30 వ్యాసరాయపుణ్యదినం. |
| 5 | శ | పం 11-0 భ 37-6. |
| 6 | ఆ | ష 13-42 కృ 40-39 సత్యవ్రత తీర్థపుణ్యదినం కుమారషష్ఠి. |
| 7 | సో | స 14-55 రో 43.3. |
| 8 | మం | అ 14 50 మృ 44-5 శ్రీ విరూపాక్ష భారత్యారాధనం, |
| 9 | బు | న 13-41 ఆర్ద్ర 43-39 శుక్రమౌఢ్యారంభం. |
| 10 | గు | ద 11-13 పున 42-30 పూ భా యాదికిచెన్నకేశవస్వామి ధ్వజారోహణం. |
| 11 | శు | ఏ 7-40 పు 40.12 సర్వేషాం ఆమలకైకాదశీ. |
| 12 | శ | ద్వా 3-30 ఉపరిత్రియో 55-4 37-10 శనిత్రయోదశి అమలకపూజా. |
| 13 | ఆ | చతు 53-5 మ 33-40 కామదహనం. |
| 14 | సో | పౌ ○ 47-15 పూఫ 29-45 అహోబలనృసింహస్వామి గరుడోత్సవం. |
| 15 | మం | బ పా 41-22 ఉఫ 25-31 పెరవలిరంగస్వామి రథోత్సవం. |

Printed and Published by Dr S Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras Editor: Dr. K. N. Kesari.

# సుమాంజలి

## కల్పవృక్షము

కానలి

నాకు బహిష్టకాలములో కడుపునొప్పిచే బాధ కలుగుచుండెను మీ లోధ్ర 4 బుడ్లను తెప్పించి త్రాగినాను అది మొదలు నాకు ఆరోగ్యముగనున్నది. బాధ తగ్గినది లోధ్ర స్త్రీలవ్యాధులకు కల్పవృక్షము

గునుపూడి కాంతమ్మ

## ప్రభావము వర్ణనాతీతము

తిరుచూరు - కొచ్చి

చాలాకాలముగ అనేక విధములైన గర్భాశయరోగములచేత బాధ నొందుచుంటిని. అనేకవిధములైన చికిత్సలను పొందితిని గాని నివారణకాలేదు కడపట తమ "లోధ్ర" సేవించిన వారమురోజులలోనే గారడివిద్యవంటుగ మందు పనిచేసెను. దాని ప్రభావము వర్ణింపజాలము.

అమ్మకుట్టిఅమ్మ
సర్కార్ హైస్కూలు

## ప్రాణసంజీవి

బెంగుళూరు

గత సంవత్సరము మూడు నెలలకాలము తీవ్రమగు అతి మూత్రవ్యాధిచే బాధపడుచుంటిని ఎన్నియో యింగ్లీషు మందులను వాడి యీ వ్యాధికి మందేలేదని యెంచితిని. కాని 'అమృత'ను వాడిచూతమని ప్రారంభించితిని. రెండుబుడ్లలోనే పూర్తిగ గుణమిచ్చినది. ఆరోగ్యము కలుగజేసినది. ఇది ప్రాణసంజీవి వంటిదని తప్పక చెప్పగలను.

జి శ్రీనివాసఅయ్యంగారు
అమిల్‌దారు, మైసూరుస్టేట్ సర్వీస్

## సర్వజ్వరములు

దేవగిరి

అనేకవిధములగు జ్వరములకు "అర్క"ను వాడ మిక్కిలి గుణముగుపడెను

డాక్టరు వి. ఎన్. రావుగారు, ఎల్. సి. పి. ఎస్.

## శస్త్రచికిత్స తప్పినది

కాకినాడ

నా భార్య చిరకాలమునుంచి పొత్తికడుపు యెడమభాగమున ఒక విధమైన శూలచే బాధపడుచుండెను సదరునొప్పి ప్రతి రెండు గంటలకు మైకముతోకూడ వచ్చుచుండెను ఈ జబ్బుకు ఆంగ్లేయ ఔషధములన్నియు వాడి విఫల మనోరథుడనైతిని కడపట రాజమహేంద్రవరము మిషన్‌హాస్పిటలుకు తీసుకొని వెళ్లితిని డాక్టర్లందరు ఆమెకు వెంటనే మదరాసులో శస్త్రచికిత్స చేయకుండిన అపాయము జరుగునని చెప్పిరి ఈ మాట వినిన వెంటనే మేము నిరాశ చెందితిమి అదృష్టవశమున తమ లోధ్రను వాడవలయునని తోచి 'లోధ్ర' బుడ్డిని పంపమని తమకు తంతి పంపితిని మొదటిపూట మందుతోనే వ్యాధి తిరుగుముఖమాయెను రెండవ మోతాదుతో బాధలన్నిపోయి గాఢ నిద్రచెందెను మరునాడు వుదయమున యిచ్చిన మందుకు నొప్పులన్నియు మాయమై మంచి ఆరోగ్యవంతురాలాయెను లోధ్ర శస్త్రచికిత్సను తప్పించెను.

పి సుబ్బరాయుడుగారు
డిస్ట్రిక్టు యింజనీరు ఆఫీసు

## మేలైన టానిక్

అరువాకం

ఆరోగ్యమును చేకూర్చుటకు "అమృత" మేలైన టానిక్కని నా యనుభవమువలన తెలుసుకొంటిని

పేరూరి సూర్యనారాయణగారు
జమీందారు

## క్వైనైను లాభించలేదు

కందుకూర్

నేను కనిగిరిలో నుండినప్పుడు, 700 గ్రెయినుల క్వైనైను మలేరియా జ్వరమునకు వాడితిని కాని ఫలితములేదు "అర్క" వాడగనే జ్వరము నిలిచినది

ఆర్ దొరస్వామి అయ్యరుగారు
తహసీల్దారు

